# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

126 మాసపత్రిక ఏప్రిల్ 1982



కవర్ చిత్రం : ద్యృతి బిస్తి

నిర్వహణ :
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు. 2

గెస్ట్ ఎడిటోరియల్

# చట్టం మంటలతో అడవిని కాలుస్తున్నారు
# కొత్త అడవి బిల్లుని ప్రవేశపెట్టనీయవద్దు

అడవిలో నుంచి మీరు నడచి వెళ్తున్నారా?—అరెస్టు చేస్తారు.

అడవిలో కాయో, కంపనో, ఆకో అలమో ఏరుకుంటున్నారా?—అరెస్టుచేస్తారు. ఎండి రాలిపోయిన ఆకులనో, కంపలనో తెచ్చుకుంటున్నారా—అరెస్టు చేస్తారు.

రాలిన కొమ్మలను రెమ్మలను ఏరుకుని, ఎండుకట్టెలను పర్చి ఏదైనా మంటపెట్టి వండుకుంటున్నారా—అరెస్టు చేస్తారు.

అడవిని, అడవిసంపదను, ఆదివాసులూ, పేద ప్రజలు తినేస్తున్నారట, అందుకని అడవిని కాపాడడంకోసం కొత్తబిల్లు తయారుచేశారు. అడవిలో పుట్టి అడవిలో పెరిగి అడవినే నమ్ముకొని అడవిలోనే చనిపోతున్న ఆదివాసులు అడవిని హరించి వేస్తున్నారట. వారినుంచి అడవిని కాపాడడానికి కొత్తబిల్లు! కోట్లకొలది రూపాయలు సంపాదిస్తున్న అక్రమ వ్యాపారులు కలప దొంగలు, అక్రమ రవాణాకు సాయంచేస్తున్న అడవి అధికారులు అడవిని అభివృద్ధి చేస్తున్నారు.

లేగల్నీ, ఆవుల్నీ, ఏనుగుల్నీ, పసి పిల్లల్నీ, పాలికాపర్లనూ మింగివేస్తున్న పులులూ, సింహాలు మనకు ప్రమాదంలేదు- అవిఅడవిని కాపాడుతూవుంటాయి— ఎటొచ్చీ రాలిన ఎండు ఆకుల్నో అందిన పచ్చతీగనో కొరుక్కుతింటున్న మేకపిల్లలే అడవికి ప్రమాదం— చిత్రంగాలేదూ?

అన్ని చట్టాల మాదిరిగానే అడవి చట్టాన్నీ బ్రిటిషు వారు తయారుచేశారు. అన్ని చట్టాలనూ చాలా పకడ్బందీగా సవరిస్తున్నట్టుగానే అడవి చట్టాన్ని చాలా గట్టిగా తయారుచేస్తున్నారు. ఈ చట్టంవల్ల 'అడవి' అంటే కొత్త అర్థం చెబుతున్నారు. మనం ఇంతవరకూ చూస్తున్న అడవికాక నాలుగుచెట్లో, మూడుతీగలో, అయిదుకంపలోవున్న ప్రాంతాన్ని అడవిగా అధికారులు ప్రకటించవచ్చు, అడవిని అనుకున్న మైదానమూ అడవే! అలానే అటవీసంపదకుకూడా కొత్తఅర్థం చెబుతున్నారు. ఆకులూ, పండ్లూ, పూలూ, తేనెపట్టులూ, చెట్లూచేమలూకాగా ఎండుఆకులు, విరిగినకొమ్మలు,

ఎండుపుల్లలు, రాళ్ళురప్పలు, పిచ్చిమొక్కలూ, పచ్చగడ్డి యివన్నీ అటవీ సంపదే! దేనినీ ముట్టుకోవడానికి వీల్లేదు. అఖరికి అడవిలో నడుస్తున్న వారినికూడా అరెస్టుచేస్తారు అనుమానంవస్తే.

తరతరాలుగా అడవిలో పుట్టి, పెరిగి అడవిలో 'పోడు' వ్యవసాయం చేసుకుంటున్న ఆదివాసులు యికమీదట పోడు వ్యవసాయం చేసుకోకూడదు. పోడు వ్యవసాయంచేస్తే అరెస్ట్‌చేస్తారు. ఎక్కడైనా ఏదైనా ప్రాంతాన్ని మేము తరతరాలుగా పండించుకున్నాము లేదా అటవీ సంపదను ఏరుకుంటున్నాము మాకు ఆ హక్కు వున్నది అని ఎవరైనాఅంటే 'కాగితాలు చూపించమంటారు, రికార్డుఉందా?'అని ప్రశ్నిస్తారు. పత్రాలు, ఆధారాలు, రుజువులు చూపించమంటారు. ఆదివాసులదగ్గర ఆధారాలేముంటాయి? 'అడవితల్లి సాక్ష్యం' అంటారు. ఆమె రాదుగా అధికార్లవద్దకు సాక్ష్యం చెప్పటానికి! ఆదివాసులు పోడు వ్యవసాయం చేసుకోడానికి వీల్లేదు. అడవిలో దొరికిన పండునో, కాయనో, కంపనో తెచ్చుకొని మైదానాల్లో అమ్ముకొని వారానికో, నెలకో సరిపడే సరుకుల్ని కొనుక్కొని మళ్ళీ అడవికి వెళ్ళిపోయే ఆదివాసులకు యిపుడు అడవిలో గడ్డిపరకనుకూడా కట్టెపుల్లను కూడా ముట్టుకోడానికి వీల్లేదు. ఎండుకట్టెపుల్లకూడా అడవే! మరి ఆదివాసులు బ్రతికేదెలా?

మన దేశంలో అపారమైన అడవి సంపద వుంది. దాదాపు అయిదు కోట్లమంది ఆదివాసులు అడవిని నమ్ముకొని బ్రతుకుతున్నారు. వారంతా ఏమికావాలి? తేనెపట్టుల్నీ, పాలపిట్టల్నీ అడవిలోనుంచి తరిమివేస్తే అవి ఏమవుతాయి? ఎక్కడకుపోవాలి?

అడవి అంటే కొత్త అర్థాన్ని చెప్పడమేకాకుండా అటవీ శాఖాధికారులకు ఏ అడ్డంకూలేని అధికారాలు యిచ్చారు. అడవిలో కనిపించిన ఎవరినైనా వారు వారెంట్ లేకుండా అరెస్ట్ చేయవచ్చు. ఏ ప్రాంతాన్నయినా రిజర్వుచేయవచ్చు అడవిగా! అడవిలో కాపురముంటున్న వాళ్ళను ఖాళీ చేయించవచ్చు, వెళ్ళగొట్టవచ్చు; ఎండుకట్టెల్ని ఏరుకువెళ్తున్నా జప్తు చేయవచ్చు. వారిని అరెస్టు చేయవచ్చు. ఎందుకు అరెస్టు చేశారనిగాని, ఎందుకు జప్తు చేశారనిగాని కోర్టులో దావావేయడానికి వీల్లేదు. అడవిలో ఏమి జరిగినా అడవి గార్డులు అరెస్టుచేసి అటవీ శాఖాధికారుల ముందు

హాజరుపరుస్తారు. మేకపిల్లకు పచ్చగడ్డి పరకలు తెచ్చుకుంటున్నా కూడా వారు అరెస్టుచేసి అధికార్లముందు హాజరుపరుస్తారు. వారు జరిమానా అయినా విధించవచ్చు. జైలుకయినా పంపించవచ్చు. అడవి అధికారులే అరెస్టుచేసి, అడవి అధికారులే న్యాయవిచారణచేసి వారే శిక్ష విధిస్తుంటే యిక "న్యాయం" ఎక్కడ జరుగుతుంది? నేరారోపణ చేసేవారు న్యాయవిచారణ చేసేవారూ ఒకటి కాకూడదు. అలా అయితే న్యాయం ఎక్కడా జరగదు. ఫారెస్టు అధికార్లకు మేజిస్ట్రేటు అధికారాలు యిచ్చారు. వారే అక్కడికక్కడ విచారణచేసి శిక్షలు వేసేయవచ్చు. జైలుకు పంపవచ్చు. విచారణ తతంగం, నేరారోపణ, సాక్ష్యాలు, రుజువులు, ఆధారాలు ఏమీ అవసరం లేదు. అట్లాగే వారెంటు లేకుండా ఎవరినైనా అరెస్టుచేయవచ్చు. ఏ ప్రాంతంలోకైనా వెళ్ళి కాయో కంపనో ఏరుకున్న వాటికోసం సోదా చేయవచ్చు. అరెస్టుచేయవచ్చు.

అందరకూ తెలుసు ఈ అడవి సంపదనంతా ఎవరు అనుభవిస్తున్నారో! కోట్లు విలువచేసే చందనం చెట్లూ, టేకుచెట్లూ, మద్దిచెట్లూ ఎవరు కొట్టుకుపోతున్నారో? అడవి నరికి అక్రమవ్యాపారం ఎవరు సాగిస్తున్నారో? లారీలమీద, ట్రక్కుల మీద కలప ఎవరు కొట్టుకుపోతున్నారో? పూలన్నీ, పండ్లన్నీ, ఎవరు తెంపుకుపోతున్నారో? కలపవ్యాపారం చేసి ఎవరు కోట్లు గడిస్తున్నారో? వీటిని అరికట్టడానికి చట్టాలు అవసరం లేదు. చర్యలు వుండవు. చెట్లకూ చెట్లకూ నడుమ పోడుచేసుకుంటున్న ఆదివాసులు అడవిని తినేస్తున్నారు! ఎండుకట్టెలు, పచ్చగడ్డి, రాళ్ళూరప్పలూ ఏరుకుంటున్న పేద ప్రజలు అడవిని అరగించివేస్తున్నారు! అందుకని కొత్తచట్టంచేసి ఆదివాసుల్ని అడవిలో నుంచి తరిమివేస్తున్నారు. చట్టాల మంటపెట్టి అధికారాల పొగపెట్టి పాలపిట్టల్ని అడవిలో నుంచి తరిమివేస్తున్నారు. అవును ఆదివాసులే అడవిలో లేకుంటే అక్రమవ్యాపారం చేయడానికి కాంట్రాక్టర్లకూ ఫారెస్ట్ అధికార్లకూ అడ్డం ఎవరూ ఏమీ వుండదుగదా! ఆదివాసులు లేకుండాపోతే అడవి సమస్య కూడా వుండదు. దొంగరవాణా చేయకుండా ట్రక్‌లను ఎవరూ అడ్డగించరు.

తరతరాలుగా అడవిని నమ్ముకొని జీవిస్తున్న ఆదివాసులు 'ఈ అడవి సంపద మాది, దీనిని అనుభవించే హక్కు మాకూ వున్నది, అడ

వినివదిలి మేం ఎక్కడకు వెళ్లాం' అని అంటున్నారు. అడవిని అనుకొని మైదానాల అంచున పంటలు పండించుకుంటున్న పేదవారిని వెళ్ళగొట్టి 'ఇదికూడా రిజర్వు ఫారెస్టే'అని అంటుంటే 'మేం ఎక్కడకు వెళ్ళి బ్రతకాల'అంటున్నారు పేద పల్లెప్రజలు.

అడవి సంపదను కాపాడడం కంటే ఆదివాసులను పేద ప్రజలను అడవిలో లేకుండా చేయడానికి గురిపెట్టిన ఈ చట్టాన్ని ప్రజాస్వామ్యవాదులు తప్పకుండా ఖండించాలి. విస్తృతమైన అధికారాలను అధికారులకు అంటగట్టిన ఈ చట్టంవలన దారుణమైన పరిణామాలువస్తాయి గాబట్టి దీనిని పౌరులంతా గర్హించాలి. ఖండించాలి.

మన దేశంలో అడవి వుంది. ఆదివాసులున్నారు. అడవి అభివృద్ధి చేస్తూ వారూ బ్రతికే ఏర్పాటు ఏదైనా చేయాలిగాని ఆదివాసులను అడవిలోంచి తరిమివేసే చట్టాలు చేయడం నాగరికత అనిపించుకోదు. అడవిని వారు కాపాడుకుంటారు. అడవిని నాశనం చేస్తున్నది అక్రమ వ్యాపారులే గాని ఆదివాసులుకాదు. ఈ దేశంలో ఆదివాసులూ, పేదప్రజలూ బ్రతికే అవకాశం లేకుండా చేస్తున్న కొత్త అడవి చట్టాన్ని ఆపుచేయడానికి ఉద్యమాలు నిర్మించాలి.

అడవిలోనుంచి ఆదివాసుల్ని తరిమివేస్తున్నారు. అడవిని అనుకున్న మైదానాలనుంచి పేదప్రజలను తరిమివేస్తారు. రేపు గ్రామాలనుంచి పేదవారిని తరిమివేస్తారు. కర్మాగారాలనుంచి కార్మికులను తరిమివేస్తారు. పాఠశాలల్లోనుంచి విద్యార్థులను తరిమివేస్తారు. పట్టణాలలోంచి ప్రజలను తరిమివేస్తారు. ఎత్తయిన భవనాలమధ్య గుడిసెలు పీకేస్తారు. అపుడు అడవిలో కాంట్రాక్టర్లూ, అటవీశాఖాధికారులు,నగరాల్లో వ్యాపారులూ, చట్టాలు చేసేవారు ఆదివాసుల బెడదలేకుండా పేదప్రజల గొడవలేకుండా, కూలీల గోలలేకుండా గుడిసెల కంపులేకుండా హాయిగా జీవించవచ్చు!

ఆదివాసులు జీవించే హక్కును హరించివేసే ఈ బిల్లును ప్రతి పౌరుడు నిరసించాలి. ప్రజాస్వామిక హక్కులపరిరక్షణకై ఉద్యమించాలి.

—ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం

ఇంద్రవెల్లి తర్వాత యధార్థ జీవిత దృశ్యాలు

# కిసింగార్ వెంతా

(అడివంటుకుంది)

సాహు

కేడతా తడిమి గోహ్కు అర్సి కిసింగార్ వెంతా (అడవిలో నిప్పురవ్వ పడి అడివంటుకుంది). జనగామా (గోండులు అసిఫాబాద్‌ను జనగామా అని పిలుస్తారు)కు పదిహేను కిలోమీటర్లు వున్న ధనోరా ఇలాకా (ఏరియా)లో గిరిజనులు భూమికోసం అడవిని నరికారు. ఇది ఇప్పటికి నలభై ఐదు సంవత్సరాలక్రితం చరిత్ర. జోడెన్ ఘాట్, బాబేఝరి, చల్‌బరడి, గోనిన్‌యోవాడ, టోయికన్ యోవాడ, భీమన్ గొంది, మురికిలొంక, నర్సపూర్ పటార్, కల్లేగామ, దెమ్మిగూడా, పట్నపూర్ - పన్నెండు గ్రామాల్ని నూతనంగా ఏర్పరచుకొని నరికిన అడవిని సేద్యయోగ్యం చేసుకున్నారు. అడవిలో నుంచి విప్పపూలు, గడ్డితెస్తేనే పన్ను వసూలుచేసే నైజాం సర్కార్ గిరిజనులు అడవి నరికితే ఊరుకుంటుందా ? గుడిసెల్ని కాల్చి, పంటపొలాల్లో పశువుల్ని మేపి, పసిపిల్లలను మంటల్లో విసిరేసి, స్త్రీలపై పశుత్వం జరిపి, నానా భీభత్సం సృష్టించి అడవి బతుకుల్ని గందరగోళం చేసింది. గందరగోళమైన అడవిబతుకుల్ని ఏకంచేసి "ఈ భూములేకాదు, అడవిమీద హక్కేకాదు, అసలు రాజ్యాధికారం మనకుకావాలి" అని ఒకచేత్తో దండ, ఒకచేత్తో బాండే (తుపాకీ) పట్టి నిజాంగుండెల్లో తుడుం మోగించి పోరాడిన కొమురం భీంను, అతని సహచరుల్ని నైజాం సర్కార్ తుపాకి గుండ్లు జోడెన్ ఘాట్ కొండలమీద బలితీసుకున్నాయి. ఆ గిరిజనవీరుల రక్తంతో ఆ నేల తడిసిపోయింది. విప్పపూలపై, గడ్డిపై పన్నులు రద్దయినాయి. ఆ గ్రామాలకు భూములు లభించాయి.

పదిహేనేళ్ళుగా సేద్యంచేసుకుంటున్న భూములకు పట్టాలివ్వక ఎమర్జన్సీలో ఆ భూముల్ని ఆక్రమించుకొని ప్లాంటేషన్స్ చేసింది ఇందిరమ్మ ప్రభుత్వం. ఉట్నూరు తాలూకాలో భూమికోసం ప్రతిఘటించిన గిరిజనుల్ని నైజాం సర్కారుకన్నా ఎక్కువ ముష్కరత్వంజరిపి తరిమివేసింది. అయితే ఆనాడు అడవిలో కొమురంభీం నిప్పురవ్వయితే, ఇవాళ అడవిలో పొరకల

పార్టీ నిష్ఫలమయింది. గోండుల ఎదలబాధ తుడుం మోగించింది. అదే భూమికోసం ఇంద్రవెల్లి 1981 ఏప్రిల్ 20న గిరిజన రక్తంతో తడిసింది. ఇంద్రవెల్లిలో గిరిజనులు ఇందిర ప్రభుత్వం గుండెల్లో తుడుం మోగిస్తే ఇందిర ప్రభుత్వం గిరిజనుల గుండెల్లో గుండ్లు దించింది. తరతరాల సుఖ దుఃఖాల విముక్తికై వీరోచిత మృత్యు గీతాన్ని ఆలపించిన కొమురం భీం వారసహృదయం మళ్ళీ ఇంద్రవెల్లిలో రక్తగానం చేసింది.

గిరిజన నెత్తుడ భూమిపూరా (గిరిజనుల రక్తంతో భూమి తడిసింది) అన్న వార్త విన్న అడవితల్లి కన్నీరు దిగమింగుకుంది, పావురాలు మౌనం వహించాయి. రామచిలుక పలుకలేదు. పాలపిట్టఎగరలేదు, నెమలినాట్యం లేదు, జింకపిల్ల ఆటలేదు, వాగులు వట్టిపోయినాయి, కోయిలమ్మ మృత వీరులకు అమరగీతం పాడింది. సర్వప్రాణికోటి మృతవీరులకు ఐక్యంగా శ్రద్ధాంజలి ఘటించింది.

ఇందిరమ్మ ప్రభుత్వం ఇంద్రవెల్లిని గిరిజన, గిరిజనేతర సమస్యగా చిత్రించాలని ప్రయత్నించింది. చేసినరాక్షసత్వాన్ని పాపపంకిలంగా రెండు కోట్ల రూపాయలతో కడిగేసు కోవాలనుకుంది.... పాపం ! కంకాళాలు కంఠాన ధరించి, కారిన రక్తాన్ని కడుక్కుంటే రాక్షసత్వం పోతుందా ? పట్టా భూములడిగిన గిరిజనులకు తుపాకి గుండ్ల పంపిణీ. బెంగుళూరు గూనల పంపకంపేరిట గూడాల ఏకీకరణ. రక్తం కార్చిన గిరిజనుల నోట్లో పాలు పోస్తూనే, పశువులు ఇస్తూనే గుండెల్లోకి నేరుగా తుపాకులు ఎక్కుపెట్ట డానికి గూడాల్లోకి రోడ్లు.

ఇంకా భూమి సమస్య పరిష్కారంకాలేదు. ప్లాంటేషన్‌లను నరికిన గిరిజనులు భూముల్ని విడవలేదు. పోరాడే జనాన్ని పోలీసు మూకలు ఎంతోకాలం అణచలేవు. ఇంద్రవెల్లి మొత్తం గోండులకు భూమికోసం. బతుకుకోసం పోరాడడం నేర్పింది. ఆకలితో చావడంకన్న పోరాటంలో చావడంమేలని చెప్పింది. సంఘాలు కట్టడం నేర్పింది. సంఘశక్తిలో ఉన్న బలాన్ని చూపింది. తలవంచడం మానిపించి తలెత్తడంనేర్పింది. ఇది రక్త సిక్తసత్యం. ఆ సత్యం వెలుగులో ఈ కథా గీతికల్ని వినండి....

## జెండా కథ

ఉట్నూరు నుంచి ఈశాన్యంగా సలభై కి. మీ. నడిస్తే దాబిలొద్ది. అలొద్ది మధ్య నుంచి కుడేరు (వాగు) పారుతుంటది. కుడేరుకు అపక్క ఈపక్క పంట భూములు. ఆ భూములల్లలొద్ది నానుకొని పిట్టగూళ్ళతీరు ఎనిమిది గూడాలు. అది విపడి (అక్టోబరు) మాసం. వానకాలం గడిచి పోయినా వానలు బాగాపడలేదు. మక్కకర్రలు నీల్గినీల్గి పీసులయినంక వగ్గి (ఎండి) పోతన్నయ్. మక్కలు పండుతె ఆ నాలుగు పూటలన్నాగడుక దొరుకుద్దనుకున్న జనానికి గుండెల్ల బండపడ్డది... పడ్డవానలైనా బుడ్‌బావే (జూన్‌లో) పడిపోయినయి. ఆ తరువాత అడపాదడపా వానలు గొట్టినా పంటలు పండనే లేదు- రబీ (వేసంగి) పంట కోసం దున్ని భూములు నల్లగా గొంగడిపరిచినట్టుగున్నయ్.

ముందనుకున్న ప్రకారం వానలు గొట్టాలని పెరుసపేనుకు (పెద్ద దేవునికి) కొలువాలని పెద్ద గూడెంలోని మంటపం (దేవుని కోసం వేసిన కప్పతప్ప పక్కలకేమీలేని గుడిశె) వైపు కదిలి వస్తున్నారు.

డప్పులు దడదడలాడుతున్నాయి. డోళ్ళు డమిడికె డిమిడికేమంటున్నాయి. జనం ఆడుతూ పాడుతూ వస్తున్నారు.

ఆకాశంలోకి కొమ్మలు చాచిన విప్పచెట్లు గాలికి ఊగుతున్నాయి. ఆ చెట్లకిందనే మంటపం-పొద్దు నెత్తిమీది కొచ్చింది. మంటపంలో ఊదు వత్తులు కాలుతున్నాయి.... వాయిద్యాల మోతకు అడివి దద్దరిల్లుతోంది. జనం తమ వెంట తెచ్చిన సారె (నైవేద్యం వండడానికి తెచ్చిన ధాన్యం) దేవుని ముందు రాసిబోసి చెట్లనీడలకు నిలుచున్నారు.

అందరు వచ్చిండ్లేమోనని మెడలు రిక్కించి ముంగాళ్ళ మీద లేచి నిలబడి చూసిన పెద్ద గూడెం జంగు "ఇప్పుడు దేవుని జెండాలెగిరేద్దాం-" అన్నాడు.

చెట్లకింది జనం గుండ్రగా నిలుచున్నారు. వాయిద్యాల మోత హెచ్చింది. ఎవడో కాలికొమ్ము (తూటుకొమ్ము) ఊదిండు. తుడుం మోత హెచ్చింది. డప్పులు ధనధనమన్నాయి....డ్యాన్సు మొదలయ్యింది. అడుగులు పడ్డాయి. పాట ఎత్తుకున్నారు.

శ్రీహరిలింగు -- శ్రీహరిజంగు / శ్రీహరిలింగు-శ్రీహరి జంగు
కోయవాసిరా — మానపేన్కురా / కోయవాళ్ళ దేవుళ్ళురా
రగిల్ జండా — దావరకజండా / ఎర్రటి జండా - తెల్లని జండా
కోయవాసి — జండాంగ్‌రా / కోయవాళ్ళ జండాలురా.
మావాంగ్ పేన్కురా / మన దేవుళ్ళురా.

ఎర్రని తెల్లని జండాలు గట్టిన ఎత్తైన వెదురుకర్రలను పాతారు. తెచ్చిన సారెతో నైవేద్యం వండి దేవుని ముందుపెట్టి ఆ పూట అందరు గడిపి వెళ్ళిపోయారు.

* * *

వాన పడలేదు. వారం రోజులయ్యింది.... గోండోల్లంత కల్సి ఎర్ర జండా ఎగిరేసినట్టుగ డి.యస్.పి. కి తెలిసింది.... ముప్పయి మందిని వెంటేసుకొని కొంపలు కాలిపోతున్నట్టుగా గూడెంలోకి వచ్చాడు.

లొద్దిలో ఖచ్చారోడ్డు మీద వ్యాను పడుతూ లేస్తూ పరుగెడుతుంటె పోలీసుల ఒళ్ళు హూనమయ్యింది. రేగిన దుమ్ము వ్యానువెంట వెంటనే సుళ్ళు తిరుగుతూ గూడెంలో దిగిన పోలీసులను కప్పేసింది. దుమ్ము నిండిన పోలీసుల మొఖాలు దయ్యపు మొఖాలయిపోయినయ్.

డి.యస్.పి. మంచం తెప్పించుకొని ఇప్పచెట్టుకింద కూర్చున్నాడు. ఇప్పచెట్టు మీద పోలీసుఖదర్ తెలియని పక్షులు అల్లరిచేస్తున్నాయి. పటేల్ ఇంటికి పోదామనుకున్నారుగాని వ్యాను పోయేటందుకు వీలుకాదని అక్కడే ఆగిపోయారు. ముసలిపోలీసు జంగును పిలుచుకొచ్చాడు. అప్పటికే గూడెంలోని రైతులంతా అక్కడికి చేరుకున్నారు.

మంచంలనుంచి డి యస్.పి. నిలబడి జారిపోతున్న లాగును పైకి లాక్కున్నాడు కోళ్ళుదిని కొవ్వెక్కిన పొట్టమీద లాగు నిలవడంలేదు.... మిడిగుడ్లేసి పోలీసుకంఠంతో "జంగ్ నువ్వేనా ?" అన్నాడు.

జంగు మాట్లాడకముందే చెట్టుమీదినుండి కాకి "కావ్ కావ్" మనుకుంటూ లేచిపోయింది.

"నేనే సార్ " జంగు....

"పోరకల సార్లెక్కడబే...." రివాల్వర్ తిప్పుతూ....

"నాకెరుకలేదు" జంగు తలొంచుకొని.

"మీరంతా ఎఱ్ఱజెండ లెగిరేసినారని రిపోర్టు."

"ఎగిరేసినం"... ఒక్క పలుచటి గోండురైతు కాలిపుండుమీది ఈగలు తోలుకుంటూ....

"ఎక్కడ ఎగిరేశారుబే...." డి యస్ పి. ఆ రైతుకేసి నడుస్తూ....

రైతులు ముందు నడుస్తుంటే పోలీసులు వెనుక.... డి. యస్. పి. టొప్పొర్రు (బలిసిన) శరీరం అసహ్యంగా ఊగుతుండగా రోలర్ దొర్లినట్టు నడుస్తున్నాడు. పోలీసులు విప్పచెట్లకిందనుండి కంకపొదలకేసి భయం భయంగా చూస్తున్నారు. దానికితోడు బండలమీదినుండి డొంకల్లో నడవడం పోలీసులకు కొత్త....చేండ్లుదాటి దేవుని మంటపందగ్గిరికి చేరుకున్నారు.

మంటపంముందు ఎఱ్ఱజెండా పొద్దుపొడుపులా రగరగలాడ్తోంది. కొడవలివంకలాగున్నచంద్రవంకనుచూసి డి.యస్.పి.కండ్లుపులపొడిచింది.

"నడుమ సుత్తేదిరా ?"

రివ్వున గాలివీచింది. జండా రెపరెపలాడింది. అంతకన్నా గట్టిగా గోండోల్లు ఘొల్లున నవ్విండ్లు.

కళ్ళున్న పోలీసులు గుడ్డోలయ్యిండ్లు.

"అది మా జాతిజెండాసార్...." జంగు.

"మరి పొరకలసార్లు రాలేదా ?"

"అన్ని గూడేలకచ్చినట్టు మాకాడికి అత్తండ్లు."

డి.యస్.పి కి తల తిరుగుతోంది.

"ఇప్పుడేడున్నారు ?"

"ఏడికిపోతరో మాకేడ తెలుత్తది సార్.... అనచ్చేది పానంపోయేది తెలువనట్టె అళ్ళసంగతి."

"ఎతా మినుకు మాకు ఒత్తటావయి." (నీళ్ళల్లవేపలు మాకేంతెల్సు) గుడ్డిగొండోడొకడు....

"ఈసారత్తే మాకు చెప్పండి...."

"గింతమంది అళ్ళకోసమచ్చిండ్లుగద" ఇంకెవడో....

పొద్దుగూకడానికి సిద్ధంగావుంగింది.... ఎండపొడ చెట్లమీదినుండి ఏటవాలుగా.... డి.యస్.పి. కాళ్లు వణికాయి.... పోలీసులు వ్యానుదగ్గరికి చేరేసరికి పొద్దుగూకింది. గాభరాగా వ్యాను పరుగులు తీసింది....

"పొరకిలసార్లంటే గంత భయమెందుకో" ఎవడో....

"తడిమి (నిప్పు)" అన్నాడు జంగు.

## ఆకలి

అసిఫాబాద్‌నుండి ఆదిలాబాద్‌పోయే మార్గంలో కేరమేరిలొద్ది, పోను పోను ఆ లొద్ది ఇరుకైపోతుంది. ఆ లొద్దిలో చెల్లాచెదురుగా చాలా గూడాలున్నాయి. ఆ గూడాలకు ప్రహరీగోడల్లాగా ఎత్తైనకొండలు. ఆ లొద్దికి ఉత్తరంవైపునఉన్న కొండ ఎక్కిదిగితే అవలిపక్క కలన్‌వాడి (మహారాష్ట్ర) ఇదంతా నైజాంకాలంలో ఒకే ప్రాంతం.... ఏటవాలుగాఉన్న గుట్టల అంచులవెంట ఏపుగా పెరిగిన వెదురుపొదలు గాలికి ఝుమ్మని కదులుతున్నాయి.

చిన్నగూడెం. సాంగ్విలో ఆమ్లేటు [ఒక భాగం] ఈ గూడానికి ఆనుకొని చిన్నగుట్ట- గాగుట్ట మళ్ళీ ఎత్తైన కొండవేపుగా పోతుంది. ఆ గుట్ట అంచునే ఓ గుడ్డి ముసలవ్వ వునుక్కుంట వునుక్కుంట చేత్తో ఒక్కొక్క ముదారి [అడివి తులసి, మైదాన ప్రాంతాల్లో భూతులసి అంటారు] మొక్కనుపట్టిచూస్తూ ప్రాణ ప్రదంగా జమ చేస్తోంది.

అది పూసు [జనవరి] మాసం. పొద్దు అప్పటికే బారెడు మీదికొచ్చింది. ఇంకా చలి ఒదిలిపోనేలేదు. ఇప్పలీదర దవడలు వణికిస్తోంది. ఆ ముసలవ్వ ఎప్పుడొచ్చి అ మొక్కల్ని ఏరడం మొదలు పెట్టిందో తెలియదు. దూరంగా మంచెమీద బుడ్డగోసి మాత్రమే గలిగిన పోరడొకడు రబ్బీ జొన్న చేండ్ల పిట్టల గొడుతున్నాడు.... ఆ చేండ్ల కంకులుమాత్రం నీలిగచ్చి వున్నాయి.... పెట్టిన కంకులు సరీగా పాలుబట్టనేలేదు. పాలు పట్టిన కాడికి పిట్టలు పొడుచుక తిన్నాయి. గుంపులు గుంపులుగా గొర్రెంకలు- ఎర్రముక్కు రామచిలుకలు.... రాత్రయ్యిందంటే కుందేల్లు, జింకలు, అడివి పందులు త యార్యారు. పిట్టలగొట్టి, జంతువులగొట్టి ఇంతాజేస్తే జాడిలి [కావలి] మందమన్న ఆ జొన్నలు వచ్చెటట్లులేవు. వానలు అదనుకు

పడలేదు.... జొన్న పంటేసిన కాన్నుంచి ఒక్క జల్లన్నా కొట్టిపోలేదు. కర్రలు పెళ్ళల్లనుంచి పైకి వెళ్ళడమే గగనమైపోయింది.

పిలగాడు వలశెల గిరగిర తిప్పి ఎదురుగా కిలకిలలాడుతూవచ్చే గొర్రెంకలమందకేసి కొట్టాడు. రాయి గుయిమనిపోయింది.... గాలికి జొన్న కర్ర లాగుతుంటె గొంతెత్తి అదేదో పిట్టకూసినట్టుగా పాటెత్తుకున్నాడు.

సూర్యవంశదేవతల్ / సూర్యవంశదేవతలు
కేతి ధర్మా సీతారా / భూమి దానంచేశారు
సూర్యవంశ రాజధాని / సూర్యవంశ రాజధాని
మావాబుడే మాతారా / మానుంచిపోయింది
కచ్చి బారెడేంగ్ మానానొత్తా / ఇనుము తుపాకులన్ని పోయినాయి
కయికాలు కుటి అలా / చేతులు కాళ్ళు కుంటయినాయి
మావారాజ్ బుడేమాతా / మా రాజ్యం కిందికిపోయింది

వెదురుపొదల్లో గొడ్డండ్లు టక్కటక్క బొంగు నరుకుతున్న చప్పుడు. బొంగును పొదల్లనుంచి జూఫ్‌జూఫ్‌మని గుంజెచప్పుడు ఆ పిల్లవాని పాటకు మద్దెలదరువులాగున్నాయి. ఆ పాటకు గుట్టలు ప్రతిధ్వనిస్తున్నాయి-

తోటిపనోల్లంత పెళ్ళిపోయారని వడివడిగా గెట్టుపొంట పోతున్న జైతు కాలుచప్పుడు విని ముసలవ్వ-

"ఎవర్రా ?" అని అడిగింది....పిల్లవాడు పాటలోని ఆఖరి చరణం మళ్ళీ మళ్ళీ పాడుతున్నాడు....

"ఊకె ఏందిరా రాజ్యంపోదామరి! కొమురంభీం సావంగ చూడ లేదా ?" అన్నది....

"నేను...." అన్నాడు జైతు.

"ఒసి నువ్వా కొడుకా ?"

"వదినరాక నిన్ను దోలిందేమే" చేతిలోని కొర్రాయితో చుట్టనుట్టిం చుకుంటూ ముందుకు నడిచాడు....

"బిడ్డా కుతిపీకుతంది. జెర నిప్పంటి ఇచ్చిపో- వదిన నడకు పనికి పోయింది. ఏదో పొట్టతిప్పలకు- చెయ్యక తప్పద్దా! పొల్లగండ్లు నాత్రి ఉపాసంబన్నరు. సెంత అంబలన్న కాసిపోద్దామని" చేతుల మొక్కల కిందేసి కూలబడిపోయింది.

జైతుకొఱ్ఱాయి చేతికందిచ్చాడు. ఎనకదిక్కుకు చుట్టిపెక్కిన వెంట్రు కలల్లో నుండి చుట్టముక్క తీసి అంటించుకుంటూ "ఎటుపోతనవ్ బిడ్డా!" అన్నది.

"బొంగుపనికి బోతన్న"

చుట్టపొగకు ముసలవ్వకు హుశారొచ్చింది. మూతిముందుకు చాచి ఊమ్మేసి "అవుర జైతు కంపినోళ్ళు సర్కారు రేటన్న కట్టిత్తలేరని, కూలీ పైసలు పెరుగాలెనని పొరకసార్లు జెప్పినంక పని బంద్ జేత్తిరిగదా-మల్లె ప్పుడు పనిసాలయ్యిందిరా! అడవిల సప్పుడత్తంటే మంచెలకాడి సప్పుడను కున్న....పైసలేమన్న బెరిగినాయి?" అరిపోయిన చుట్ట మళ్ళీ అంటించు కుంటూ....

"గొఱ్ఱా.... నీయక్క.... లే.... లే.... యాఁ...." గొంతుచించుకొని పిల్లవాడు మొత్తుకుంటున్నాడు....

"పది పైసలు పెరిగినయ్ కట్టకు. గందుకనే పోతనం....కొఱ్ఱాయి యియ్యవే....అలిశ్యమయ్యింది" అన్నాడు జైతు.

"గుడ్డిదాన్ని జెరగిమోపు గట్టియ్యవురా! అప్పటి నుంచి సూత్తన్నా గిటు మొఖాన ఎవలురాలే-సచ్చినీ కడుపున బుడుత గుడ్డిదాని తీరుగ గాదులే-" కొఱ్ఱాయిచ్చింది....

కొఱ్ఱాయిని గట్టుమీద బెట్టి కొద్ది దూరంలో ఉన్న పచ్చికంక బొంగు నొకదాన్ని కొట్టుకొచ్చి బేరే (నార) చీరుతూ జైతు....

"జానన్న పనికత్తలేడు....పనికి పోయచ్చేటాల్లకే రాత్రయితంది. తెల్లారి మల్లపనే ఆ గూడెం వచ్చుడే అయితలేదు" అన్నాడు.

"మీ దాదా [అన్న] రెండు పంటలు సుప్పరవేజర్ కాడ అడ్మాన్ తెచ్చిండా? తెచ్చినోడు పనికి పోడాయె. రేపు మాపు పైసలత్తయని సర్కారు సుట్టు తిర్గి సావబట్టె- అర్నెల్లయిపాయె- అకడి [జాతై]మైనకాడ్నించి తిరుగ బట్టెనా? మొన్న లెచ్చిన ఇన్నూరు లంచం బెట్టిండు. సావుకారే నయం ఇత్తె ఇత్తనంటడు. లేపోతే లేవంటడు గీ సర్కారోడు సావుకార్లకన్న పెద్ద దొంగలున్నట్టున్నది. జానన్న ఇయ్యల్ల తెల్లారగట్లనే జనగాఁమ పోయిండు- ఎడ్లిస్తరో- దుడ్లిస్తరో-నోట్లో మట్టిపెడ్తలు గొడుతరో-" అంటూ అరిపోయిన చుట్టముక్క నెత్తిల చెక్కుకున్నది.

"ఏదో ఎడ్లో గొడ్లో ఇయ్యనియ్యరాదే బాడ [ఎడ్లు కిరాయకు తెచ్చుకొని చేసే వ్యవసాయం. జత ఎడ్లకు ఒక సంవత్సరానికి గోనెడు (దాదాపు 20 కుంచాల జొన్నలు) యివ్వాలి] ఎవుసాయం జేత్తే. జాగిలి, కష్టం అన్నీ మన్నుపాలే అయితన్నయిగదా! ఇగ బాడ జొన్నలు ఇయ్యంగ మిగిలేటియి అడ్డెడో బుడ్డెడో గద ఏం కడుపు నిండుతద" జైన మోపుకడుతూ అన్నాడు.

"నిజమే బిడ్డా! సంసారం సాగదు- సావురాదు"అనుకుంట చీలికలు వాలికలైన చీరె పేగు బిగించికట్టింది. చేతికర్రబట్టుకొని నిలబడ్డది.

జైతు ముసలవ్వ నెత్తిమీద మోపుబెట్టి కొ!రాయి బట్టుకొని అడివి దారి బట్టిండు.

ముసలవ్వ చేతికర్ర పొడుచుకుంటూ గొనుక్కుంటూ పునుక్కుంట పునుక్కుంట నడుస్తూ "నైజాంరాజు కాలంల భూమిలేక తిప్పల్లు బడ్తిమి. గిప్పుడు భూముల్లేకనే సావబడితిమి. ఉన్న సెక్కలేసిన జొన్నరానేరాదాయె- ఆకటికి ఎప్పుడు సచ్చుడేనాయె- యాడాది పొడుగుత అడివిమీదనేబతుకు- పురుగులు, ఆకులు- బెనం ఏది పోదాయె- రేగుపండ్లు, తునికిపండ్లు.తవిసిగడ్డలు, మాడిగడ్డలు, ఇప్పపూలు, గునుకవిజ్జ [గునుగుపూలు] ముదారి, బాష్టి, జొన్నబెండు, పరికిపండ్లు, అరెకాయలు గియ్యన్ని అర్నెల్లు తింటె ఉప్పిడుపాసాలు. మూన్నెళ్ళు. ఇగ మూన్నెళ్ళు కూలికైకిలి జొన్న పంట, కందులు- బత్తచేవడి వాతరా- మిర్కుటు పుట్టుతేకే ఘాటో పుట్టో- ఘాటో పుట్టుతేకే సోవర్ పుట్టో [ఏడి కట్టముచ్చెరా! కారం దొరుకుతే గడుక దొరుకదు- గడుక దొరుకుతె ఉప్పుపుట్టదు] ఏంబతుకులో- ఏం సంసారాలో...." ముసలవ్వ చప్పిడి దవడలు ఇంకా కదలలేకపోయాయి.

* * *

గూడెంలో చిన్నపిల్లలు ఆడుకుంటున్నారు. ఆ ఆటలు ఉషారుకొద్ది ఆడే ఆటలు కావు....ముఖాల మీద పేరుకున్నభయంకరమైన ఆకలిని మరిచిపోవడానికి చేసే ప్రయత్నాలు.... కడుపులు ఈడ్చుకపోతున్నాయి. ముఖాలు మాడిపోయున్నాయి. ఆకలికుట్టు ఎక్కువకాగానే చిన్నపిల్లలు తల్లి గుర్తుకొచ్చి ఏడుస్తున్నారు.... చిన్నవాళ్ళను సముదాయించడానికి పెద్ద పిల్లలు జొన్నబెండ్లు తెచ్చి యిస్తున్నారు.... గూడెం ఇప్పుడు పిల్లల అధికా

రంలో ఉన్నది. చిన్నపిల్లలు ఆకలికి ఆగలేక లేగలు నమిలినట్టుగా జొన్న బెండ్లు నములుతారు. పెదవులు కోయగానే ఏడుపు.... పిడుదు నెత్తురు లాగా నోట్లో నెత్తురు. ఓదార్చడానికి మళ్ళీప్రయత్నం. ఎదురుగ ముసలవ్వ కనిపించగానే గబగబా ఎదురుగ ఉరికారు. అందర్నీ తిట్టుకుంట నెత్తిమీద మోపును వాకిట్లోపడేసింది. ఏడిచే పిల్లవాన్ని తలంతా పునికిచూసి ఓదార్చి ముద్దాడి సన్ను నోట్లోబెట్టింది. పెద్దపిల్లలు మళ్ళీ ఆటకు వెళ్ళారు. ఆ పిల్ల వాడు తల్లి చన్నే అనుకున్నాడు.....ఎంత గుంజినా చుక్కరాదు.... ఆకలి తీరదు....మళ్ళీ ఏడుపు....ముసలవ్వ పసివాన్నిచాచి చెంపమీద కొట్టింది.

"దరిద్రపోడా" తిట్టింది.... పిల్లవాడు ఎక్కెక్కిపడి ఏడుస్తున్నాడు. పిల్లవాన్ని మళ్ళీ దగ్గరకు తీసుకొని ఓదార్చింది.... ఏడ్చేడ్చి జోకొట్టగానే కళ్ళుమూశాడు.

తెచ్చిన ముదారిమొక్కల్ని ఓగంటసేపు కొడితే సోలెడన్ని గింజలు రాలినయ్....చెట్లుఎండక కొన్ని మిగిలిపోయాయి. వాటిని శుభ్రంచేసేసరికి పొద్దు నెత్తిమీదికొచ్చింది గింజల్ని చాటలపోసుకొని పునుక్కుంట పును క్కుంట భూమిల పాతివున్న విసుర్రాయికాడికి జరిగింది....

"ఓ పార్వతి రావే పోరీ ఏడసచ్చినవ్" పిలిచింది.

"ఓ" అంటూ పదేండ్లు మించని పిల్ల ముక్కుచీమిడి ఎగబీలుస్తూ వచ్చింది.

ఇద్దరు కలిసి విసుర్రాయి తిప్పారు. పిండి జమచేసి పొయ్యిదగ్గరికి వెళ్ళింది ముసలవ్వ. పిల్లను కట్టెలకు దోలింది. పొయ్యి రాజేసి ఎసరు బెట్టింది. అప్పటికే ఆవురావుమంటూ పిల్లలు పొయ్యికాడికిచేరారు.... వచ్చి రాని మాటలు, నత్తి నత్తిమాటలు, ఎడతెగని చర్చలు- గిచ్చుకోవడం కొట్టు కోవడం ఏడవడం....ముసలవ్వ కసురుకుంటుంది ఓదార్చుతుంది.

జావాబుడ్డిదించి "జావాకాలుతంది కసేపాగుండ్లి వాగుకుబొయి సెలి మల నీళ్ళుపట్టుకత్త-"అని చెప్పి మంచినీళ్ళకుండ, పురక (చేదు అనిగెపు కాయ బుర్ర) పట్టుకొనిపోయి ఏటవాలుదారిని తిట్టుకుంటూ నీళ్లు తెస్తోంది. అసలే బండలదారి కండ్లు కన్పియ్యవు.... బండ కాలుకు తాకి సొలిగి కింద బడ్డది. కుండ పగిలింది. కట్టె జారింది. తొంటికి దెబ్బతాకింది. జారిపోయిన

కఱ్ఱను వెతుక్కొని "దేవుడ నీ గుల్లెరాయిబడ గుడ్డిదాన్ని కొంటబోక ఎందు కుంచినవ్. గుడ్డిలోకం మంచోల్లనేసంపుతండ్లు" తిట్టుకుంట గుడిసెకొచ్చింది.

"ఏయా (అవ్వా !) జానా మొత్తం నెయికు (కుక్క) తాగింది" పిల్లలు చావుకబురు సల్లంగ చెప్పారు....

కుక్క మూతి తుడుచుకుంట తోక తిప్పుకుంట గుడిసెచూరుకింద వన్నది....

జానా తాగంగ పిల్లలు బెదిరిస్తేనే గుర్రుమనిమీదికిలేచింది....పిల్లలు మీదబడి పెనుగులాడాలనుకున్నారు.... కాని దాని పండ్లు చూస్తే ఎవరికి ధైర్యంచాలలేదు. ముసలవ్వ మాటవిని వణికిపోయింది. కండ్లుంటే ఆకుక్క వెంటబడి చీరేసేదేమొ ?....

పెద్దపిల్లకు తెల్లసర్వ యిచ్చి నీల్లు తెమ్మన్నది. ఆ పూటకు ఆ నీళ్ళే ఆహారం....

• • •

ఎఱ్ఱగా నెగడి మండుతోంది.... చలి.... ఒంటి మీద బట్టలు లేవు. నెగడిచుట్టూ పడుకున్నారు. అర్ధరాత్రిపైనే దాటింది. చంటిపిల్లడు ఏడవ గానే సీత మేల్కొని పాలిస్తుంది. ముసలవ్వకూడా లేచింది.

"ఏ సీత జాను రాకపాయెనేందే.... అవుగని యియ్యాల బట్వాత (జీతాల పంపిణీ) అయిందేమో" అని అడిగింది ముసలవ్వ.

"అడ్మాస్ పైసల్ల కోతపెట్టుకన్నరు" అంటూ జవాబిచ్చింది.

బయట కుక్కలు మొరుగుతున్నాయి. "ఛీఛీ ఈ పాడు కుక్కలు అప్నంగానే (కారణం లేకుండానే) మొరుగుతాయి" అంటూ చీదరిచ్చు కున్నది ముసలవ్వ.

జనగామపోయి అప్పుడే వచ్చిన జాను తడిక తీసుకొని లోపలికొచ్చి నెగడిముందు కూర్చున్నాడు.

"పోయిన పనేమయింది బిడ్డా" అంటూ కాళ్ళొస్తున్న పిల్లను పక్కకు జరిపింది ముసలవ్వ.

"పదిహేను రోజులు పడతదంట" అన్నాడు చుట్టముట్టిస్తూ జాను. ముసలవ్వకు ఎక్కడలేని కోపం వచ్చింది. "చేస్ల జాన్వర్ (జంతువులు)

వస్తే జాగిలుండి కొడతానం. సాముచేస్తానం. ఉర్లుపోసి సంపుతానం.పండే పంట కాపాడుకుంటానం. మరి మనల కళ్ళముందటే దోచుకుని పెరిగి పోయిన దోపిడోళ్ళను, అప్సర్లను లంచం తిన్నోళ్ళను, భూములు నరికితే కేసులుపెట్టి తుపాకులతో కాల్చి చంపే సర్కార్ను మనమెట్టిగిడ్సి పెడతానం. జన్వర్‌కు ఒక న్యాయం, మైనల్ (మనిషి)కి ఒక న్యాయం. నువ్వు సిన్నగున్నవ్. గప్పుడు నాకు గుడ్డితనంరాలే. దొడ్డిడు గొడ్లు పుట్టెడు మేకలు జొండ్లు, తిండికి కరువులేకుండె. గీ తిండిబెట్టి నిన్ను సాదలేదురా.... ఈసాల్ కరువేనాయె. ఏం జేత్తాంది సర్కారు? తహసీలు కడతలేమా, ఘర్‌పట్టి (ఇంటి పన్ను) ఇస్తలేమా? ఇయ్యన్ని ఏం జేత్తాండ్లు? ఈసర్కారు సత్తెనాశిడం గాను, అదుకుంటాండ్రా ? మన బతుకే మారింది. గొడ్లుపోయినయి, గోదలు పోయినయి"

"సాపం బెడితే (తిడితే) మారతదానే బతుకు" అన్నాడు జాను.

"సాపం బెడితే బతుకు మారదు నిజమేగని.... మీరంతా గాజులన్న తొడుక్కోపోతిరి....ఇంద్రవెల్లిన జూడు మన కోయతూర్ (ఆదివాసులు) అలేమాతోరో(మేల్కొన్నారు)!పొరకలసార్లు చెప్పినట్లు మేమన్న బందూకు పడతము" అంటూ ఆవేశంగా మాట్లాడింది.

ఆకలితో పడుకున్న పిల్లలు, లంచం తీసుకున్న బ్యాంక్ మేనేజర్, బిడిఓ, పట్వారి...., ఇంద్రవెల్లి,సర్కారు, పోలీసులు, జాన్వర్, పంటచేను అన్నీ కళ్ళల్లో తిరుగుతున్నయి. నిద్రలేని కళ్ళు....

తండ్రి హీనంగానే బతికాడు, తల్లికి రోగమొస్తే మందు వేయించలేక గుడ్డిదయింది. అతను చివరికి మందులేకే చనిపోయాడు. దవాఖానా పాడా? తనదీ హీనమైనబతుకే. కూటికిలేదు, కరువులు. తనపిల్లల ఎండినడొక్కలు.

నెగడిపక్కనే ఒరిగిన జాను 'అలేమాయానా [మేల్కోవాలి] అలే మాయానా" అంటూ నిద్రపోయాడు. అప్పటికి తెల్లారి చుక్క పొడిచింది. "పల్ వియిలేన్ జామ్ గడియా మాంతా" [సూర్యోదయానికి ఇంకా జాము రాత్రి వుంది]

## నిర్ణయం...

పెద్ద కొరి[లోయ]. ఆ కొరిమధ్యగుండాపోతే కుడేరు గలగలమంటూ మధ్యగా ప్రవహిస్తుంటుంది. ఎడమవైపున కొంప పోలా నడిస్తే ఎత్తయిన

పర్వతపంక్తులు. రెండువైపుల ఏటవాలుగా పర్వతసానువులు వుండి మధ్య
స్థలం ఏర్పడ్డంమూలంగా పెద్దలోయలా కన్పిస్తూంది. ఎత్తయిన ఆ పర్వత
పంక్తుల్ని ఎక్కిచూస్తే దాదాపుగా క్రిందనున్న మైదానప్రాంతం పదికోసుల
వరకు కన్పిస్తూంటుంది. ఆ పర్వతంమీదే విశాలమైన పటార్ |కొండ మీద
విశాలమైన ప్రాంతం| కన్పిస్తూంది.

పటార్ మీద అడవి పెద్దగాలేదు....అని పూర్తిగా లేదనికూడా చెప్ప
లేం....వెదురు, టేకు అందుకు చెట్లు ఏపుగాపెరిగి, ఎక్కువభాగం మైదా
నంగా గడ్డితో ఉంటుంది. పటార్ మీదకూడా మళ్ళీ గుట్టలు, లొంకలు....
ఉండటంవల్ల చిన్నలంప్డి[ఒర్రె] పుట్టుకొచ్చి నీళ్ళుపారుతుంది. ఆ లంప్డి
ప్రక్కనే తేమఉండటంవల్ల గడ్డి ఇంకా కాస్త పచ్చగాకన్పిస్తూంది. అది
మహా|ఫిబ్రవరి|మాసం, దూర్వాడి|మార్చి| ఇంకా నెలరోజులుండచ్చు.అప్ప
టికే అడవిలోఉన్న మోదుగులు ఎర్రపూలుపూచి గాలికి కదులుతుంటే-....
తేనెటీగలు ఝమ్ అని నాదంచేస్తూ పోతున్నాయి. లంప్డిప్రక్కనేఉన్న పెద్ద
ఇప్పలకింద పుట్టి [నలభై] పశువులు.... కడుపారా నీళ్ళుత్రాగి నెమరేస్తూ
పడుకున్నాయి,....

గాయుకేరు [పశులకాపరి] శీడంగన్ను. అతని వయస్సు చెప్పలేంకాని
వృద్ధుడుగా కన్పిస్తున్నాడు. ఎండిపోయిన చెంపలు, లోతుకుపోయిన
కళ్ళు, చిరిగిన రూమాలు....నెత్తిమీదికొచ్చిన సూర్యునివేడి తట్టుకోవడానికి
అతన్ని ఆచ్ఛాదించే వస్త్రాలు ఏమీలేవు. మొలకున్న దోతిపేగు, రుమాలే.
అతన్ని అంత వేడినుండి కాపాడేది అడవితల్లే.... కండలేని అస్థిపంజరం
గూడఅయిన ఆ చేతుల్లో ఓ మర్సు.[గొడ్డలి] నోరు ఉందికాబట్టి ఆపశువులు
ఇతని ఆజ్ఞల్ని పాటిస్తున్నాయి.

కాళ్ళుచేతులు కడుక్కొనివెళ్ళి మొర్చి|సారెపప్పుచెట్టు| చెట్టుకు పారి
వున్న పరికితీగ. ఆ పండ్లకోసం.... పరికితోపాటు ఆ చెట్టునుకూడా నరికి....
పరికిపండ్లు ఏరుకుని బుక్కాడు....కరువు కడుపుకు అవేం మొదలౌతాయి?..
మళ్ళీ నీళ్లు త్రాగి ఏరుకున్న రేగుపండ్ల మూట విప్పి ఇప్పనీడకుపోయి
కూర్చున్నాడు. ప్రొద్దున్నుండి పటార్ మీద తిరిగి తిరిగి ఓసారి లొద్దికిపోయి
మళ్ళీ మీదికి.... మీద ఎక్కి దిగే లోయలు.... అతన్ని అలసిపోయేటట్టు
చేశాయి. కన్నంటుకుంది.

ప్రొద్దు వంగిపోయింది.... పశువులు మళ్ళ మేతకు కదిలాయి....నక్కి నక్కివచ్చి చిరుతపులి ఎద్దును పట్టేసింది.... ఎద్దు అరుస్తూంటే పశువులన్నీ చెల్లా చెదరయినాయి. చూస్తూండగానే ప్రాణాలుతీసి గుంజుకు పోయింది.

కళ్లనీళ్ళు కళ్లలోనే మిగిలినాయి. అతని స్వంతానికంటూ మిగిలినవి రెండే రెండు నాగటెడ్లు. పది పశువుల వరకు వుండేవి.... గతంలో చాలాసార్లు జంగ్లాత్‌వాళ్ళు భూమి సేద్యంచేసుకోనివ్వం అంటె పశువులన్నీ అమ్మి వందలకు వందలు రూపాయలు లంచాలు చెల్లించారు. ఇతనేకాదు ఇతని గూడెంలో వాళ్ళుకూడా. చౌకిదార్లు మారినప్పుడల్లా అది మామూలైంది. అట్లా పశువులన్ని అపులులు [చౌకిదార్లు]తింటే ఇప్పుడు పోగాపోగా మిగిలిన రెండెడ్లల్లో మళ్లొటిపోయే.... కాలేకడుపు....కసి....తనబ్రతుకు.... అన్నీ అతన్ని వేడెక్కిస్తున్నాయి....చెదిరిన పశువుల్ని దగ్గరచేసి గూడెంవైపు త్రిప్పాడు.... పడమటి దిక్కున సూర్యుడు.... రగ రగ బండిగిర్రంత వెడల్పుగా కన్పిస్తున్నాడు....

♦ ♦ ♦

అదిగూడెం. నాలుగే గుడిసెలు....వాటిచుట్టు ఎడ్లకోడార్లు[దొడ్లు] .. సేద్యపుభూమి అంతంతమాత్రంగానే వుంది.... దూరంగా పది మంచెలకన్న ఎక్కువ భూమిలేదు, ఇంత పటార్ మీద కెందుకొచ్చినట్లు? రానే రాకపోదురు కాని.... క్రింద లొద్దుల్లో గుట్ట అంచులవరకు భూమి సేద్యం చేస్తున్నారు.... వీళ్లకు భూమిలేదు. వాల్ల తండ్రులునరికిన నర్సపూర్‌పటార్ జంగ్లాత్‌వాళ్ళు ఖాలీ చేయించారు. అప్పటి నుండి ఇక్కడకు వచ్చి గుడిసెలు వేసుకుని పశువుల్ని మేపుకుంటు బ్రతుకుతున్నారు. అదే క్రమంలో వీళ్లుకూడా. పట్వారి లంచం ఇస్తే భూమి కొట్టుకొండ్రన్నాడు. చౌకిదార్ వచ్చాడు అతనికి ఇచ్చారు. కాని జంగ్లాత్‌వాళ్లు ఎన్నోసార్లు ఇండ్లనుకాల్చారు, పశువుల్ని అగం చేశారు. జైల్లో వేశారు.... కాని భూమిని విడువలేదు— తహసీల్ కడుతూనే వున్నారు.

గొడ్లను కోడారిలో తోలి గుడిసెకొచ్చిన గన్ను కాల్లకు నీల్లిచ్చింది.... అప్పటికే చీకటి చాయలు అలుముకుంటున్నాయి.

"ఏందిరో విచారంగవున్నావు ఎప్పుడు ఏదో మాట్లాడేటోనివి" అన్న మాటలతో....కాళ్లు గడుగుతున్న గన్ను, గాగురువైపు జూశాడు....

"వెయ్యి రూపాల ఎద్దును సిరుతగొట్టిందిరా" అన్నడు గన్ను. భార్య లక్ష్మి కళ్ళల్లో నీల్లు తిరిగినాయి....ఉండలేక గుడిసెలోకి పోయింది.....

"అడవి బ్రతుకులు...." మాటలు పూర్తిచేయకుండానే గాగురు వెల్లి పోయిండు.

రూమాల్ పేల్కతో ముఖం తుడుచుకుంటు "సచ్చింది ఏడుత్తే వత్తాదే. మన బ్రతుకే గింత పొలగాండ్లకు ఏమన్నజెసిపోసినవా మల్ల ఉపాసమేనా" అంటు నెగడిముందు కూర్చున్నాడు.... దీపాలున్న గోండుల ఇండ్లు తక్కువే. నెగడే వాళ్ళ వెలుతురు....

"జొన్నలు తెద్దామని కిందికిపోయి వచ్చిన. పోతే అసాములు మాకే తిండికి ఉర్పటచ్చే (బాధ) కరువేనాయ్ జొన్నలు పండలేదాయ్ వాంకిడి అంగట్లకొని తెస్తం. అప్పుడు రమ్మన్నరు. ఉత్తగనేపోయి వచ్చుడయింది రానుగాడిది పోనుగాడిది" అని పొయికెల్లిపోయింది.... పొయిమీదున్న జావా బుడ్డి కంచం....ఆకులో మిరపకాయలు తెచ్చి జావా గిన్నెలో పోస్తూ "పొద్దుగాల పోయి వచ్చినంక కేలిక్ విజ్జ (గునుక గింజలు) పుడస్కఫి (ఊరిపేరు)కి దిగి బాయిలందరం కల్సి బండెడంత తెచ్చినం అవి దంచు తాంటే చౌకిదారు పోలీసోల్లను పట్టుకొని వచ్చిండు" అంటూ జావా గిన్నె అందించింది....నోటికాడ పెట్టుకొని గుటికెడుదాగి గన్ను "ఎవరన్న గూడెంల ఉన్నారా అప్పుడు"....అన్నాడు.

"మల్కుదాదా వుండే....మనిషికి ఐదువందలు తెస్తేనే ఉంచుత రట....లేకుంటే మల్లేందో...." అంటు తనూ ఇంత జావపోసుకుంది గిన్నెలో ఇద్దరు అయిష్టంగానే త్రాగుతున్నారు....మనసుల్లో.... ఎద్దుపోయె....మల్లా చౌకోల్లచ్చిరి....కూటికి లేదాయ్....జానా కొద్దిగానేవున్నా ఎంతో వున్నట్టుగా వుంది వాళ్ళకు....లేచారు....

బండెడు తెచ్చి కేలిక్ దంచిన విజ్జు మనిషి తలా తవ్వెడే వచ్చినయి. ఆపూట అందరికి ఆ గూడెంలో అదే ఆహారం.... ఎద్దుపోయి ఉన్న గన్ను గుండెల్లో చౌకోల్ల మాట తుపాకి పేల్చినట్లయింది.... గదొక్కటే తక్కువ ఇప్పటికేమన్న తక్కువజేసిండా?అని విచారంతోటి రుమాల్లో సుట్టదీసి గుడి సెల మధ్య పెట్టిన నెగడికాడికి వచ్చిండు. అప్పటికే అక్కడ గాగురు, మల్కు, కేసు.... పిల్లగాండ్లు జమయింద్రు....

గన్ను జేరుకొంగనే.... అందరు విచారం వెలిబుచ్చింద్రు.... చుట్ట ముట్టించుకుంటు-

మల్లచౌకొల్లదేందో" అన్నడు మల్కను జూస్తూ గన్ను.

"అవుపొద్దగాలచ్చింద్రు.... అంబటల్లాకు పైసలియ్యకపోతే ఉట్నూ రోల గుడిసెల్ని కాల్చినట్లు కాల్చి అడ్డమొస్తె తుపాకులేస్తాం. ఇంద్రవెల్లిన చేసినట్టే చేస్తం అన్నరు" అన్నడు చుట్ట తాగుతున్న మల్కు....

"నాలుగునెల్లక్రిందటే పట్వారిగాడు పట్టాలయితానయి తహసీల్ దారుకు కూడా కొంత ముట్టచెప్పాలె అంటే తలా రెండువందలిత్తిమి. నీయవ్వ లంచాలు ఇచ్చినయన్ని కలిపితే భూమి కొనుక్కుందుంగదరా" అంటు గన్ను ముందుకు జరిగిండు....

"కాల్చుడు అల్కగ నేర్చుకున్నారు" అంట మౌనంగావున్న గాగురు ముందుకు జరిగిండు....

"వాల్లచ్చినంక నేను క్రింద సర్పంచుకాడికి పోయిన. వాడు గూడా ఇయ్యాలన్నడు" అంటూ మల్కు అన్నాడో లేదో....

"వానికేమెరుక గొండోడువాడు మనసొంటోడే....పదిహేనేండ్లనుంచి జెత్తానం....తహసీలుకడతానం.... వాల్లడిగింద్రు....మీరియ్యండ్రి అనచ్చు. పోయి....ఏమన్న నిలదీసి అడుగుతడా...." అన్నడు కేసు కోపంగా....

కాలిన కట్టెల్ని నెగట్లకు ముందుకుజరిపిండు పిల్లగాడొకడు. బాయిలు [స్త్రీలు]గూడా అందరువచ్చి సంభాషణ వింటాంద్రు....

"ఇగో బాగినుండ్లి.... మనం పైసలిచ్చుకుంట బతకలేం.... ఉట్నూ రుల.... గిట్లనె భూముల్ని గుంజి ప్లాంటేషన్ చేసింద్రట.... మల్లాగా భూముల కోసం వాళ్ళు లంచాలు ఎన్ని గుమ్మరిచ్చిన కాలే.... అందరొక్క టయిండ్లు ప్లాంటేషన్లు నరికింద్రట.... అడ్డమొచ్చిన చౌకోల్ల, పోలీసోల్ల బాయిలు, పిల్లలు అందరుకల్సి గెదిమింద్రట మనంకూడా గట్లనేచేద్దాం.... బాగా ఇచారం చేయిండ్రి...."అంటూ ఆవేశంగా మాట్లాడి అందరి దిక్కూ జూసిండు....

"ఇగో సచ్చిందోనాడు పుట్టిందోనాడు.... చేసిన రెక్కల కట్టం దొం గల పాలు జేసుడేంది.... తిండికే సత్తానమంటే.... పైసలెక్కడ.... వాళ్ళు

మనల జైల్ల ఏసిన మంచిదే.... ఇంగ ఊరుకోవద్దు.... గీ గొడ్ల మేపుతా ఎంతకాలం బతుకుతం.... భూమి కావాలెగని.... ఏదో ఇంత ఉడుకు నీళ్లకు సలినీళ్లోతిగగని...." అన్నడు కేసు. అందరు మౌనంగ వున్నరు.

ఉడువాన్కే భూమి పాజిలే / దున్నేవానికి భూమికావాలే
మరట్ భూమి ఉమానా / మనమే భూమిని గుంజాలే
మరట్ భూమి గెల్వానా / మనమే భూమిని గెల్వాలే
మరట్ భూమి తూసానా / మనకు భూమిని పంచాలే

పిల్లవాడొకడు పాట అందుకున్నాడు.... నెగడి మంటల్లో అందరి మొఖాలు గంభీరంగా వున్నాయి.... మల్కు చుట్టు ఎర్రగా వుంది....

"నిర్ణయం అయినట్లేగదా" అన్నడు మల్కు.

"ఔ అంటే.... ఒకేమాట.... గిది మారద్దు" అన్నడు గన్ను.

"అంతే అంతే" అన్నరు బాయిలు....

ఎర్రగా నెగడి కాలుతుంది.... డొంత్రుకాయి [మేకల ఆహారం, ఒక రకమైన కాయ] అప్పటిదాకా కొరుకుతున్న పిల్లడొకడు నెగట్లో వేశాడు....

**అమరుల రక్తం వృధా కాదు...**

ఆది కేస్లాపూర్ జాతర.... గోండ్లంతా.... ఆనందంగా నడుపుకునే జాతర....కాని అది....పోలీసుల జాతరయింది....ఖద్దరు బట్టల, ఖాకీబట్టల జాతరయింది....

యమభటులు ముందుండగా....

సర్కారు ధర్మరాజులు దర్బారు నిర్వహించారు....

గోండ్ల మౌనం....ధర్మరాజుల ఉపన్యాసాల జోరు....

ఇంద్రవెల్లిలో గిరిజనుల రక్తపుతడి ఆరలేదు....

గిరిజనుల అభివృద్ధి పెద్దపెద్ద అక్షరాలు పేపర్లలో పురుడోసుకున్నాయి....వచ్చిన వాళ్లెవరు ఇప్పుడు తాండవిస్తున్న కరువు గూర్చి పల్లెత్తు మాటనలేదు....భూములు నరకద్దు....మేమే ఇస్తాం....

పాడిందే పాడరా పాసు పండ్ల దాసరి.... వినలేని గోండ్లు పలికిన మాటలు.

సర్కారు కలవరపడుతంది....

బుదురకిస్తే భూమి పోరాపం....

మా జాతరకూడా అనందంగా జరుపుకోనిస్వతే....

పోలీసుల రాజ్యం ఇది

ఇక్కడ్నేమో అప్పులిస్తమంటారు....తిరిగి తిరిగి లంచాలు తింటేగాని అప్పియ్యరు

తుడుం గొట్టుకుంటానే ఉండ్రలా....

ఇంద్రవెల్లిన భూమి మా నా నెత్తుర పూరా

[ఇంద్రవెల్లిన భూమి మన నెత్తురుతో తడ్సింది]

సీతా రెండు కోట్కు ఒన నెత్తుడా పూర్తా

[ఇచ్చిన రెండు కోట్లు వాళ్ళ నెత్తుర్లో కడిసినయి....]

పోరాటం ద్వారానే ప్రతీదీ జరుతుంది అనే సత్యం తెలుసుకున్నారు.

## కరువుపాట

1982.... అది పూసు [జనవరి] మాసం.... రబీ జొన్నకర్రలు గాలికి కదులుతుంటే గలగల చప్పుడు చేస్తున్నాయి. జొన్న ఏమంత మంచిగాలేదు పోయినేడు కరువు.... మళ్ళీ ఈఏడు కరువు.... తిండికి కటకటగావుంది.... విప్పపూలు దూరాడి[మార్చి]అఖరికుకాని రాలవు. ఆకలితీరే దిక్కులేదు. షావుకార్లు అప్పులిచ్చుడు మానుకున్నారు. సర్కారు సాపుచేస్తాంది....వాన కాలమయిన ఇంత ఆకుఅలము తినేటోళ్ళు. ఇప్పుడేం పుట్టుద్ది ఒక్క మాటి గడ్డలు [విషపుగడ్డలు]తప్ప....అవే కాస్త అదరవు.... లేమితిండ్లతో కండేటు పెరుగుతుంది. తిండికలిగితే కండకలదోయి కండకలవాడేను మనిషోయి.... అచ్చంగా దీనికి భిన్నంగావుంటుంది. అదిగో ఆ బొగడమీదే తిప్పగూడెం. ప్లాంటేషన్‌లో వేసిన జొన్నకర్రలు....ఇంకా పంటకు రాలేదు. గూడెంలోకి పోతే....

సజీవ అస్థిపంజరాలన్నీ నెగడిముందు కూర్చున్నాయి.... చీకటిగా వుంది....ఆ గూడెంలోనే వాళ్ళకు ఇంతకాలం ముందుండి....పోరాటం నడిపిన పొరకలసారును అరెస్ట్‌చేశారు పోలీసులు....జొన్నమేపుతం అని బెదిరించారు జంగ్లాత్‌వాళ్లు....అది మాటల్లోనే. జంగ్లాత్‌వాళ్లు గూడెంలోకి రావడానికి ఇంకా చాలకాలం పట్టచ్చు.... అదవ వచ్చినా పోలీసులు లేనిదే ఎన్నడు గూడెంలోకి పోవడంలేదు....

నెగడిముందు కూర్చున్నవాళ్ళు డోల్కి మ్రోగుతుంటే.... వున్న బల మంతా కూడదీసుకుని.... గొంతులు విప్పారు....

సిల్లేరే బాబా సిల్లేరే / లేదురా బాబు లేదు
ఇద్ గరీబున సర్కార్ సిల్లేరే / ఇది పేదవాళ్ళ సర్కార్ కాదు

భూమింగ్ సీభోం ఇంజేరే / భూములు ఇస్తామంటారు
భూమింగ్ సీరుడ్ సిల్లోరే / భూములు ఇస్తానేలేరు
భూమింగ్ సీమ్‌టు ఇత్తేకే / భూములు ఇమ్మన్నమంటే
బాండీగోలి రేహత్తేరే / తుపాకిగోలి దించిరే

భూమింగ్ పొహజిలే ఇత్తేకే / భూమి కావాలంటే
కొంరాంగ్ సిభోం ఇంజేరే / గొడ్ల ఇస్తామంటారు
కొంరాంగ్ సిభోం ఇంజేరే ఓరు / గొడ్ల ఇస్తామన్నోళ్ళు
కొంరాంగ్ గేరాసి మడ్ సిల్లేరే / గొడ్లకూత ఇస్తానేలేరు.

మూంద్ మైనా తిరిసి తిరిసి / మూడునెల్లు తిరిగి తిరిగి
కామ్‌న నష్టం కీతోమే / పనిదండుగ చేసుకుంటిమి
సిల్లేరే బాబా సిల్లేరే / లేదురా బాబు లేదు
ఇద్ గరీబున సర్కార్ సిల్లేరే / ఈ సర్కారు మనది కాదు

సర్కార్ ఉరుమత్ తోడో / సర్కార్ అధికారంతో
బ్యాంక్, బ్లాక్ వాతారా / బ్యాంక్ బ్లాక్ వచ్చాయి
సియ్యం మాహుక్ అప్పు ఇంజేర్ / అయిదువందలుఅప్పులిస్తామని
రెండు మాహుక్ సీతోరే / రెండు వందలే ఇస్తాంద్రు

సీతా రెండు మాహుక్కనా / ఇచ్చే రెండు వందల్లో
బ్యాంక్ మేనేజర్ బి.డి.వో / బ్యాంక్ మేనేజర్, బి డి.వో.
ఏన్నాన్ లంచం తిత్తోరే / ఏభై లంచం తిన్నారే
మాకున్ లూటి కిసేర్ మంతోరే/మనల లూటి చేసిండ్రే

కాల్‌కున్‌కు బూట్ కేరిసి / కాళ్ళకు బూట్లు తొడిగి
ఉలన్‌తా కోట్ కేరిసి / ఉలన్ కోట్లు తొడిగి
కడుకునేకే ఐనక్ కేరిసి / కళ్ళకు అద్దాలు పెట్టి
పెరుసోర్, పెరుసోర్ లోకోలే / పెద్ద పెద్ద లోకులే

సోవియట్ కవిత

# ఎవరికీ తెలియదు

డెమ్యాన్ బెడ్నీ



ఆ రోజు
మిగిలిన అన్నిరోజుల్లాగే
కొంచెం నెరిసిన నల్లని ముసుగు
కప్పుకుంది
వీధికొసన కానిస్టేబుల్ బిగ్గరగా
వేసిన కేకకు
ఆగంతకులు జవాబిస్తున్నారు
నెత్తిమీద పుర్రె ధరించిన
ప్రధానాచార్యుడు*
కెథెడ్రల్‌ను నిర్వహిస్తున్నాడు
సారా దుకాణం ముందర
తాగుబోతులు
తెల్లవారినప్పటి నుంచీ కోర్కెలు
నిండిన కేకలువేస్తున్నారు
శరీర విపణిలో స్త్రీలు
తేనె మీద ఝుమ్మని ముసిరే
ఈగలలాగ
పైసాకోసం బేరాలాడుతున్నారు

---

సోకునే, పిస్సేరు మంతేరు / సోకుగా బతుకుతుందిలే
సోకునే, పిస్సేరు మంతేరు / సోకుగా బతుకుతుండరే.

ఉడువాన్‌కే భూమి పాహిజలే [దున్నేవాడికే భూమి] అంటూ నేల కొరగిన అమరవీరుల రక్తనినాదం ఇంకా చెవుల్లో గింగురుమంటూనేవుంది. అడవిలో.... పోరకల దాదా [అన్న]ల కోసం.... పోలీసుమూకల గాలింపు సాగుతూనేవుంది.... అయినా.... మళ్ళీ.... మళ్ళీ.... క్రొత్త క్రొత్త రక్త గీతాలుకట్టి పాడుతూనే వున్నారు.

కొనుగోళ్ళ తొందరలో గృహిణులు
పట్టుచీరల వరుసలో గుంపుగా దూసుకుపోతున్నారు
ప్రతీకాల అధికారి ద్వారం ముందర
బాధతో మూగవాడైన రైతు—
ఆ రైతు ముందు
ఎండకు ఎండే బోర్డుమీద వేలాడుతున్న
చిరిగిపోయిన జార్ ప్రణాళిక.

నిప్పును చల్లార్చే మనిషి
అప్పుడే పట్టుబడ్డ ఎలుగ్గొడ్డులాగ
తన బురుజు చుట్టూ అదేపనిగా తిరుగుతున్నాడు.

బారక్‌ల ముందురి పరేడ్ మైదానంలో
అధికారుల తిట్లకు లయబద్ధంగా
సైనికులు మార్చ్ చేస్తున్నారు.

ఒక బళ్ళవరస నదివైపు కదిలిపోయింది
దుమ్ముకొట్టుకుపోయిన పడవ వాళ్ళు
గబగబా నడుస్తున్నారు.

ఒక కాపలా మనిషి చిరిగిన బట్టల విద్యార్థిని
మంచి రోడ్డు మీద ఎటో తీసుకుపోతున్నాడు.
కాలిబాట మీద నడుస్తున్న ఒక కార్మిక హస్తం
తన భావాలను బయటికే ప్రకటిస్తోంది
"దురదృష్ట విద్యార్థీ! సెలవు, సెలవు!"

ఆ మామూలు రోజునే, వేకువజామున
తరాలవేదన భరిస్తున్న ఆభూమిలో
రష్యాలో లెనిన్ పుట్టాడని
ఎవరికీ తెలియదు.

(ఇంగ్లీషులోకి : డోరియాన్ రాటెన్‌బర్గ్)

---

* రోమన్ కాథలిక్ చర్చిలో ప్రధాన ప్రీస్ట్ తలమీద పుర్రెతో చేసిన టోపీ పెట్టుకోవడం ఆచారం.

# విద్యాకళా సాంస్కృతిక రంగాలగురించి లెనిన్

క్లారా జెట్కిన్

లెనిన్ మమ్మల్ని చూసేసమయానికి మేం కళగురించీ, విద్యగురించీ, పెంపకం గురించీ చర్చించుకుంటూవున్నాం. సరిగ్గా ఆ సమయానికి నేను సాంస్కృతిక రంగంలో బోల్షివిక్‌లు చేపట్టిన అద్వితీయమైన, అపూర్వమైన కృషిపట్ల నా ఆశ్చర్యాన్ని ప్రకటిస్తున్నాను. కళా, విద్యారంగాలలో కొత్త పుంతలు తొక్కేందుకు ప్రయత్నిస్తున్న దేశీయ సృజనాత్మక శక్తులను ప్రోత్స హించడమే ఈ కృషి. అయితే నేను పరిశీలించిందాంట్లో ఎక్కువభాగం రేఖామాత్రంగా ఉన్నదని, ఇంకా చీకట్లో తడుములాడుతున్నదని, ప్రయోగ దశలో ఉన్నదని నాకేర్పడిన అభిప్రాయాన్ని నేనేమీ దాచలేదు. సాంస్కృతిక రంగంలో కొత్త వస్తువుకోసం, రూపాలకోసం, పద్ధతులకోసం జరిగే తీవ్ర అన్వేషణలో సాధారణంగా పాశ్చాత్య పద్ధతులను గుడ్డిగా అనుకరించాలనే అసహజమైన ఆకాంక్ష కలుగుతుంది. మేమిట్లా మాట్లాడుకుంటుండగానే లెనిన్ అతిశ్రద్ధగా మా సంభాషణలోకి దూసుకొచ్చాడు.

"సోవియట్ రష్యాలో నూత్న కళాసంస్కృతులను సృష్టించే కార్యక్రమంలో వినూత్న శక్తులు మేలుకోవడం, వాటిని అభివృద్ధిపరచడం మంచిపనులే, చాలా మంచిపనులే. ఉప్పెన వేగంతో జరుగుతున్న వాటి అభివృద్ధి అర్థంచేసుకోదగిందీ, ప్రయోజనకరమైందికూడా. శతాబ్దాల నిర్లక్ష్యంవల్ల కలిగిన నష్టాన్ని మనం సరిచేసుకోవాలి. మనమేం చేయదలచుకున్నామో దాన్ని సరిచేసుకోవాలి. సంక్షోభం, కొత్తనినాదాలకోసం తీవ్రమైన వెతుకులాట, ఇవాళ మతోన్మాద కేకలతో నినాదాలు, రేపు 'అతణ్ని శిలువ వేయండి' అనే కేకలతో ఇవాళ్టి నినాదాల నిరాకరణా— ఇవన్నీ కళాతాత్విక రంగంలో అనివార్యం.

ఇన్నాళ్ళుగా బంధించబడ్డ అన్నిశక్తులనూ విప్లవం విడుదలచేస్తుంది. వాటి జీవితపు లోతుల విరామాలనుంచి ఉపరితలాలకు నెడుతుంది. ఉదాహరణకు మా చిత్రకళాభివృద్ధిమీదా, శిల్పం అభివృద్ధిమీదా, వాస్తుశాస్త్రం అభివృద్ధిమీదా జార్ ఆస్థానపు మోజులు, ధనిక, బూర్జువా వర్గాల అభిరుచులు వేసిన ప్రభావం చూడండి. స్వంత ఆస్తిమీద ఆధారపడ్డ సమాజంలో కళాకారుడు మార్కెట్‌కోసం తయారుచేస్తాడు. వినియోగదారులను కోరుకుంటాడు. మా విప్లవం కళాకారుణ్ని ఈ దుర్భర పరిస్థితుల కాడి కింది

నుంచి తప్పిస్తుంది. మా విప్లవం రాజ్యాన్ని కళాకారునికి రక్షకునిగానూ, కక్షిదారుగానూ తయారుచేస్తుంది ప్రతి కళాకారునికీ, తాను కళాకారుణ్నని అనుకునే ప్రతివాడికీ స్వేచ్ఛగా సృజించేహక్కు ఉంది. ఏ విషయంతో సం బంధంలేకుండా తన ఆశయాన్ని అనుసరించే హక్కు ఉంది.

కాని మేం కమ్యూనిస్టులం చూస్తూ కూచొని సంక్షోభాన్ని స్వేచ్ఛగా అభివృద్ధి చెందనివ్వం. ఈ కార్యక్రమమంతా ఒక నిర్ణీత ప్రణాళిక కింద నడిపించబడాలి, పొందవలసిన ఫలితాలు రూపొందించబడాలి. మేం ఈ గమ్యానికి దూరంగానే ఉన్నాం, చాలా దూరంగానే ఉన్నాంకూడా. చిత్ర కళలో పాతవాటినన్నిటినీ మేం బద్దలుకొట్టాం. అందమైన ప్రతీదీ పరిరక్షిం చబడాలి అది పాతదైనప్పటికీ తిరోగమనదశకు ఉదాహరణగా పరిరక్షించ వలసిందే. నిజంగా అందంగా వున్నదాన్ని పాతదనీ, తిరోగమన స్థానమనీ తిరస్కరించడమెందుకు? తోసివేయడమెందుకు? కొత్తను దైవంలాగా ఆరా ధించి కొత్తదైనంతమాత్రాన దానికి లొంగిపోవడమెందుకు ? అర్థరహితం ! బూటకమూ అర్థరహితమూను ! దీంట్లో చాలా భాగం కపటత్వం, కొంత వరకు పాశ్చాత్య కళాధోరణుల పట్ల అవ్యక్త వ్యతిరేకతా ఉన్నాయి. మేం మంచి విప్లవకారులమేకాని మేం ఆధునిక సంస్కృతికి తగినట్లుఉన్నామని రుజువుచేసుకునే ప్రయత్నానికికట్టుబడి ఉన్నామనుకుంటాను.ఏదేమైనా నాకు మాత్రం నేను ఆటవికుణ్నని చెప్పుకునే ధైర్యం వుంది. ఎక్స్‌ప్రెషనిజం, ఫ్యూచరిజం, క్యూబిజం లాంటి ఉన్నత కళామేధోరూపాల ఉత్పత్తులను గుర్తించడం నాకైతే మించినపని. నాకవి అర్థంకావు. వాటినిచూస్తే నాకే ఆనందమూ కలగదు."

నేను ఇక ఆపుకోలేకపోయాను. ముక్కు, మొఖానికి బదులు ఒక ప్రేరిత ముఖాన్ని త్రిభుజాలలో కళాత్మకంగా ఎందుకు వ్యక్తీకరించాలో నాకర్థంకాలేదు. విప్లవ కార్యక్రమంకోసం తహతహలాడుతున్నవాళ్ళను— మనుషులుగా ఒకదానికొకటి కలపబడిన అవయవాలతో ఒక సంకీర్ణ నిర్మా ణం కలిగినవాళ్ళను- రెండు కట్టెలమీద నిలబెట్టబడిన ఒక నిర్దిష్టరూపం లేని, ఐదు పళ్ళచెంచాలు రెండు తగిలించుకున్న బస్తాలాగా ఎందుకు చిత్రించాలో నా కర్థంకాలేదు. అర్థంకాలేదనీ, గ్రహించడంలో విఫలమయ్యా ననీ ఒప్పుకున్నాను.

లెనిన్ పగలబడినవ్వాడు.

"నిజమే క్లారా, కాని మనమేమీ చేయలేం. మనిద్దరం ముసలి మూర్ఖులం. విప్లవానికి సంబంధించినంతవరకు మనం మొదటి వరసలో ఉన్నామనేది, మనం యువకులుగా ఉన్నామనేది మనకు చాలు. కాని మనం కొత్తకళతోపాటు కలిసి అడుగులు వేయలేం. వెనుక నడవవలసిందే.

కాని కళమీద మన అభిప్రాయమేమిటనేది ముఖ్యమైన విషయం కాదు. లేదా లక్షలజనాభాలో ఏ కొన్ని వందలమందో, వేలమందో కళ అంటే ఏమనుకుంటున్నారనేది ముఖ్యంకాదు. కళ ప్రజలందరికీ చెందినది. శ్రామికప్రజానీకం మధ్యలో దాని వేళ్ళు లోతుగా పాతుకుపోవాలి. ఈ ప్రజానీకమే దాన్ని అర్థంచేసుకోవాలి, ప్రేమించాలి. అది వాళ్ళ భావనలను, ఆలోచనలను, విశ్వాసాలను ఐక్యంచేయాలి. అభివృద్ధి పరచాలి. వాళ్ళలో అది క్రియాత్మకతను రగుల్కొలపాలి. వాళ్ళలోని కళాప్రేరణలను అది అభివృద్ధిచేయాలి. శ్రామిక రైతాంగ ప్రజానీకం మామూలు నల్ల రొట్టెకోసం ముఖంవాచిపోతుంటే మనం అందమైన తియ్యని కేకును ఒక చిన్నపాటి అల్పసంఖ్యాకవర్గానికి పంచిపెట్టగలమా? నేనీకిందచెప్పబోయేది మాటకు మాటగానేకాక అంతరార్థాన్నికూడా అర్థంచేసుకోవాలని చెప్పాల్సిన అవసరంలేదనుకుంటాను. ఎల్లవేళలా మనకళ్ళముందు కార్మిక రైతాంగం ఉన్నారు. వాళ్ళకోసమే మనం నిర్వహించడం నేర్చుకోవాలి, లెక్కించడం నేర్చుకోవాలి. ఇదే కళా సాంస్కృతిక రంగాలకుకూడా వర్తిస్తుంది.

కళను ప్రజలదగ్గరికి తీసుకుపోవడానికీ, ప్రజలను కళదగ్గరికితీసుకుపోవడానికీ మనం మొట్టమొదట వాళ్ళ విద్యా, సాంస్కృతికస్థాయిని పెంచాలి. ఈ విషయంలో మేం ఏంచేస్తున్నాం? మేం అధికారానికివచ్చిననాటి నుంచి మేం సాధించిన అపారమైన సాంస్కృతిక ప్రగతి మీకు అసక్తికరంగానే ఉంటుంది. మేమీ విషయంలో సాధించింది చాలా ఎక్కువని ఏ గొప్పలూలేకుండా నిస్సందేహంగా చెప్పవచ్చు. అన్నిదేశాల మెన్షివిక్కులూ, మీ కాటిస్కీ ఆరోపించినట్టు మేం తలలు నరికే పనిమాత్రమే చేయలేదు. ఎన్నో తలలను చైతన్యవంతం చేసినాం. ఎన్నోఅనేది గతంతో పోల్చినపుడు మాత్రమే. అప్పుడు అధికారంలోఉన్న వర్గాలు, ముఠాలు చేసిన నేరాల పోలికతోఅంటున్నాను. మేం కార్మికరైతాంగంలో కలిగించిన విద్యాదాహం,

సాంస్కృతికదాహం లెక్కించరానంత గొప్పగా ఉన్నాయి. ఇది పెట్రో గ్రాడ్‌కో, మాస్కోకో లేదా ఇతర పారిశ్రామికనగరాలకో మాత్రమే సంబంధించింది కాదు. వాటి పరిమితులనుదాటి మారుమూల పల్లెటూళ్ళకు మేం చేరుకోగలిగాం. అదేసమయానికి మేం అంతులేని పేదరికంలో ఉన్నాం. బిచ్చమెత్తుకుంటున్నాం. ఐనా నిరక్షరాస్యతకు వ్యతిరేకంగా మేం నిజమైన దృఢమైన యుద్ధం తలపెట్టాం. మేం పెద్దా చిన్నా నగరాల్లోనూ, గ్రామాల్లోనూ గ్రంథాలయాలూ పఠనాలయాలూ తెరుస్తున్నాం. మేం అన్నిరకాల శిక్షణాకార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. మేం మంచి చిత్రాలనూ, నాటకాలనూ సమర్పిస్తున్నాం. సంచార ప్రదర్శనలనూ, విద్యా రైళ్ళను దేశమంతటా తిప్పుతున్నాం. కాని నేను మళ్ళీ ఒకసారి అదే ప్రశ్న వేయదలచుకున్నాను. ప్రాథమిక పరిజ్ఞానంలేని, చాలా ఆదిమసంస్కృతిలోని వందల వేల జనాభాకు మేం చేసేది ఏం సరిపోతుంది? మాస్కోలో మా గొప్పవైన రంగస్థలాల్లో ప్రదర్శనలతో ఇవాళొక పదివేలమందీ రేపొక పదివేలమందీ ఆనందపరవశులవుతూ ఉండగా లక్షలాదిమంది జనం తమ పేర్లు సరిగ్గా ఎట్లా పలకాలో నేర్చుకోవడానికి పెనుగులాడుతున్నారు. లెక్కించడం నేర్చుకుంటున్నారు. భూమి బల్లపరుపుగాకాక గుండ్రంగావున్నదనీ, భూమి మంత్రగాళ్ళతోనో, 'స్వర్గవాసియైన తండ్రి'తోనో నడవడంలేదనీ, సహజనియమాల వల్ల నడుస్తున్నదనీ తెలిపే సంస్కృతిని పొందేందుకు ప్రయత్నిస్తున్నారు."

"కామ్రేడ్ లెనిన్! నిరక్షరాస్యత గురించి అంత బాధపడకండి. కొన్ని విధాల అది మీ విప్లవాన్ని సులభతరంచేసిందికూడా. బూర్జువా భావనలతో కార్మిక, రైతాంగవర్గాల మెదళ్ళు నిండిపోకుండా, మొలకెత్తకుండా నిరక్షరాస్యత అడ్డుకుంది. మీ ప్రచార ఉద్యమ విత్తనాలు సారవంతమైన నేలలో విత్తబడుతున్నాయి. అంతకుముందు ఉన్న ఆదిమ అరణ్యాన్ని నరకవలసిన అవసరంలేనిచోట విత్తడమూ, సాగుచేయడమూ సులభం" అన్నాను నేను.

"అది నిజమే. కాని కొన్ని పరిమితుల్లోనే! ఇంకా సరిగా చెప్పాలంటే మా పోరాటపు ఒక ప్రత్యేక దశవరకే. అధికారం కోసం యుద్ధం చేస్తున్నప్పుడు పాత రాజ్యాంగ యంత్రాన్ని నాశనం చేయడమే ముఖ్యం గనుక నిరక్షరాస్యతను సహించాం. అయితే నాశనం చేయడం కోసం మాత్రమే

నాశనం చేస్తామా మనం? నిరక్షరాస్యతకూ, పునరుజ్జీవనానికీ పొసగదు. మార్క్స్ చెప్పినట్టు కార్మికుల కృషి అంతా అన్నిటికంటే ఎక్కువగా పునరుజ్జీవనం కోసమే వుండాలి. మార్క్స్ చెప్పిన ఈ మాటకు నేను రైతాంగం పేరు కూడా కలుపుతున్నాను. స్వేచ్ఛ పొందాలనుకుంటే వాళ్ళుకూడా పునరుజ్జీవనం కోసమే కృషిచేయక తప్పదు. మా సోవియట్ వ్యవస్థ ఈ కృషిని సులభతరంచేస్తుంది. అందువల్లనే ఎన్నో సోవియట్లలో, సోవియట్ సంస్థల్లో వేలాదిమంది సాధారణ శ్రామిక జనం పునరుజ్జీవనాన్ని త్వరితం చేయడం ఎట్లాగో నేర్చుకుంటున్నారు- వాళ్ళు నూతన యవ్వనంలో ఉన్న స్త్రీ పురుషులు. వాళ్ళు తమ దేశంలో తాము అభివ్యక్తం కాదల్చుకున్నారు

వాళ్ళల్లో చాలామంది పాత ప్రభుత్వం కింద పెరిగారు. అందువల్ల వాళ్ళేమీ చదువుకోలేదు, సంస్కృతి పొందలేదు. కాని ఇప్పుడు వాళ్ళు జ్ఞానం కోసం తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. సోవియట్ కార్యక్రమాల కోసం ఎప్పుడూ కొత్తగా స్త్రీ పురుష బృందాలను పనిలోకి తీసుకుంటూ వుండాలని, వాళ్ళకు ప్రయోగాత్మకమైన, సాంకేతికపరమైన విద్య నేర్పాలని మేం నిర్ణయించుకున్నాం. ఐనప్పటికీ సృజనాత్మక నాయకత్వం కోసం మాదేశంలో ఉన్నడిమాండ్‌ను మేమింకా పూర్తిగా అందుకోలేకపోతున్నాం. పాత పద్ధతికి చెందిన పెత్తందారీ అధికార్లనే కొన్నిచోట్ల నియమించవలసిన స్థితికి మేం నెట్టబడ్డాం. దానితో ఇక్కడ పెత్తందారీ అధికారవర్గం పెరగడం మొదలైంది. ఈ బ్యురాక్రసీ అంటే నాకు పరమ అసహ్యం. ప్రత్యేకంగా నా దృష్టిలో ఏ ఒక్క బ్యురాక్రాటూ లేడుగానీ, అతడెంత తెలివిగలవాడైనప్పటికీ నేను అసహ్యించుకునేది మొత్తంగా ఆవ్యవస్థను. దానిలోపైనుంచి కిందివరకు లంచగొండితనమూ, నిర్వ్యాపకతా నిండి వున్నాయి. ప్రజల్లో పెద్దఎత్తున విద్యనూ, శిక్షణనూ వ్యాపింపజేయడమే బ్యురాక్రసీని దాటడానికీ, తొలగించడానికీ నిర్ణాయకశక్తి అవుతుంది.

భవిష్యత్తుగురించి మా ఆలోచనలేమిటి ? శ్రామిక, రైతాంగ యువజనం సంస్కృతిని నేర్చుకోవడానికీ జీర్ణించుకోవడానికీ వీలుగా మేం చాల పెద్ద సంస్థలు నిర్మించాం, ఎన్నో మంచి కార్యక్రమాలు చేపట్టాం. ఐతే ఇక్కడకూడా అదేప్రశ్న వస్తుంది. జనాభాతో పోల్చిచూస్తే ఈ కృషిఅంతా కలిపి ఎంత ? నిజంగా బాధాకరమైన విషయమేమంటే మాకు కిండర్

గార్టెన్‌లు, బాలసదనాలు, ప్రాథమిక పాఠశాలలు ఉండవలసిన దానికన్నా చాలా తక్కువగా ఉన్నాయి. లక్షలాదిమంది శిశువులు సరైన పెంపకం, విద్య లేకుండానే యవ్వనంలో ప్రవేశిస్తున్నారు.-వాళ్ళ తాతలూ తండ్రులూ ఎంత అజ్ఞానులుగా, అనాగరికంగా ఉండేవారో వాళ్లూ అట్లాగే ఉంటున్నారు. ఈ విధంగా ఎంత ప్రతిభ నశించిపోతున్నది! వెలుగువైపు సాగుతున్న ఎంత అన్వేషణ కరకు పాదాలకిందబడి నలిగిపోతున్నది! ఉదయించే తరం సంతోషాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఇది భయంకర నేరం. ఇది కమ్యూనిస్టు సమాజంగా మారవలసిన సోవియట్ రాజ్యంనుంచి దాని సంపదను దొంగిలించడమే అవుతుంది. ఇది ఎంతో ప్రమాదంతోకూడిన పని."

మామూలుగా మృదువుగా ఉండే లెనిన్ గొంతు ఆగ్రహంతో వణికింది.

మా ముగ్గురికీ ఆవేశపంతమైన ఉపన్యాసాన్ని ఇచ్చేటట్టు చేసిందంటే ఈ సమస్య ఆయనన్నెంతగా కదిలించిందో అని నాకనిపించింది. మాలో ఎవరో ఒకరు కళా సాంస్కృతిక రంగాలలో జరుగుతున్న కొన్ని ప్రత్యేకమైన సందేహాస్పద అంశాలను లేవనెత్తి వాటిని "కాలమహిమ" గా వ్యాఖ్యానించారు. వెంటనే లెనిన్ జవాబిచ్చాడు.

"నాకవన్నీతెలుసు. ప్రస్తుతకాలపు కష్టాలూ, ప్రమాదాలూ అన్నీ రొట్టె, సర్కస్‌లు, రంగుటద్దాలు పంచిపెట్టడంద్వారా తొలగించవచ్చునని చాలమంది దృఢంగా నమ్ముతున్నారు. రొట్టె పంచవలసిందే రంగుటద్దాలు పంచనివ్వండి. నాకేమీ అభ్యంతరంలేదు. కాని రంగుటద్దాలు నిజంగా గొప్ప కళ ఏమీకాదనే విషయం మరిచిపోనివ్వకండి. అది కొంచెం ఎక్కువ తక్కువగా ఆకర్షణీయమైన వినోదమని నేనంటాను. రోమన్‌లంపెన్ శ్రామిక వర్గానికీ, మన కార్మిక రైతాంగానికీ పోలికలేదనే విషయాన్ని మనం మరిచి పోగూడదు. మనవాళ్ళు రాజ్యం ఖర్చులమీద బతకడంలేదు. పైగా తమ శ్రమతో రాజ్యాన్ని నిర్వహిస్తున్నారు. విప్లవం నడిపింది వాళ్ళే. విప్లవ ప్రయోజనాన్ని పైకెత్తి పట్టుకున్నదీ, రక్తప్రవాహాలు కార్చిందీ, అప్రకటిత త్యాగాన్ని భరించిందీ వాళ్ళే. నిజానికి మన కార్మిక రైతాంగం రంగుటద్దాల కంటె మంచివి పొందడానికే అర్హులు. అందువల్లనే మేం ప్రజావిద్యను, శిక్షణను అన్నింటికంటె ముఖ్యంగా భావిస్తున్నాం. ధాన్యంసమస్య పరిష్కార

# బూడిద ఎత్తుకుపోయారు....

బొజ్జా తారకం

ఆకాశం అంచులకు
నల్లతెరలు వేలాడ
దీస్తున్నారు
చప్పుడు ఒకటీ ఒకటీ
ఆగిపోతూ వున్నది
హఠాత్తుగా ధనేలుమన్నది
చీకటిలో తుపాకీ
ఎక్కడా చప్పుడు రాకూడదని
మరీ కణతల దగ్గర నొక్కి
తుపాకీ పేల్చారు
అయినా ఏదో
ఖణేలు మన్నది
జనాల ఘోషలు
జనాల బాధలు
కంకాళం నుంచి
కారినట్టున్నాయి
ఎక్కడిదీ చప్పుడని

---

మైంతర్వాత సంస్కృతికి పునాది కలిపించేది విద్య, శిక్షణలే. ఈ పునాది మీదనే వాస్తవంగా వినూత్న మహత్తర కమ్యునిస్టు కళ అభివృద్ధి చెందుతుంది. ఈ కళరూపాన్ని వస్తువుతోపరస్పరసంబంధంగలదిగా సృష్టిస్తుంది. మా మేధావులు ఈ దిశలో ఎంతో ప్రాముఖ్యత కలిగిన ఎన్నో మంచిపనులు చేపట్టవలసివున్నది. ఈ కర్తవ్యాలను అర్థంచేసుకొని, పరిపూర్తి చేయడం ద్వారా వాళ్ళు శ్రామిక విప్లవానికి పడిన బాకీని చెల్లించ గలుగుతారు. కమ్యూనిస్టు ప్రణాళికలో స్పష్టంగా చిత్రించబడ్డ దుర్భర జీవన పరిస్థితుల నుంచి ఈ మేధావులకుకూడా నిజానికి ఈ శ్రామిక విప్లవమే బయటికి గమ్యాన్ని చూపింది.

('లెనిన్ గురించి నా జ్ఞాపకాలు' అనే వ్యాసం నుంచి)

చుట్టూ చూశారు
ఏదీ కనబడలేదు
తుపాకీలు ఎత్తిపట్టి
ఏ దిక్కని తెలియకుండా
పరుగెత్తారు పోలీసులు
శవాన్ని ఎత్తుకొని
కంకాళం కనబడకూడదని
కణకణ కాల్చేశారు
మంటలు ఆరినాక
ఇంటిదారి తీశారు
మెల్లగ ఏ అలికిడికో
బూడిద రేగింది
ఏమో, అది ఏ సాక్ష్యం
చెబుతుందో అని
మళ్ళీ తిరిగొచ్చి
బూడిద ఎత్తుకుపోయారు....

---

## పెద్దిశంకర్ గుండెనిప్పులు

సమతశ్రీ

బెల్లంపెల్లి తల్లి ఒడిల చంటిపాపల పిడికిలల్ల
హమాలోల్ల అరిసేతుల్ల నెత్తిన బొగ్గుతట్టలల్ల
రాడికల్లు జెండ ఎరుపుల భూమిపోరాటాల మలుపుల
ఉప్పెనయి కదిలే జనంల కత్తులొరిసిన చప్పుడాట

పెద్దిశంకర్ గుండెనిప్పులవి ధీరుడో ఓ రైతుకూలన్నా
అగ్గిమంటల వేడిసెగలవ్వి లేచిరా ఓ కూలిచిన్నన్నా

కమ్యూనిస్టుపేరవున్న దొంగయూనియన్ లీడర్ల
అధికార్లు దొరలతోటి కలిసిమెక్కి బలిపెటోల్ల
ముసుగుచింపి శంకరన్నా గొంతువిప్పి పిలుపుయిస్తే
గుండె గుండె బదులుపలికే వాడ వాడ కదిలివచ్చె
కార్మికులు విద్యార్థులు జనాలంతా జులుస్‌దీసి
ప్రతినిమిషం పోరాడే ప్రజలదే ఎర్రజెండ అని

రివిజనిస్టుల రిమ్మదింపింఁడ్రో ధీరుడో ఓ రైతుకూలన్నా
నకిలిగాల్ల నడ్డివిరిచింఁడ్రో లేచిరా ఓకూలిచిన్నన్నా ॥రాడికల్లుజెండ॥

బండకాల్లుపిండి జేసిన ఎండుటాకులుగయేటోల్లకు
కట్టెలమ్మిన తట్టమోసిన పొట్టగడువని పేదవాల్లకు
ఫ్యాక్టరీల్లో కొలువుగొలిసి గంజి గతికి బతికిటోల్లకు
వెట్టిజేసి రెక్కలుడిగి మట్టిగలిసిన బతుకులోల్లకు
వర్గపోరు జేయకుంటె మన బతుకులు మారబోవని

పెద్ది శంకర్ గుట్టు విప్పిండో ధీరుడో ఓ రైతుకూలన్నా
పేదలంతా సంఘం గట్టింఁడ్రో లేచిరా ఓ కూలి చిన్నన్నా
॥బెల్లంపెల్లి॥

కులాలను పాటిస్తె మాత్రం కూడు ఎట్లా దొరుకుతుందని
భాషలైనా మతాలైనా మనిషి బతుకును మార్చలేవని
గోసిపేల్కల గోండులైనా పూరిగుడిసెల కోయలైనా
ఎక్కడున్నా పేదలంతా ఒక్కటేననితెలుసుకోని
"మావో బ్యాడ్జీ పొందినమన శంకరన్న"తొపదునుదేలి
భూమికోసం బువ్వకోసం గూడుకోసం గుడ్డకోసం
ఎడ్డి ప్రజలు కండ్లుదెరచి ఏకమై కదిలిసాగి

చెన్నూరుల సేతులెత్తింఁడ్రో ధీరుడో ఓ రైతుకూలన్నా
లక్సెట్ పేటల లడాయి చేసింఁడ్రో లేచిరా ఓ కూలి చిన్నన్నా
॥రాడికల్లు॥

బాకీలిచ్చి కష్టజీవుల బతుకు గుత్తకు గొనేటోల్ల
అసలు అంతని వడ్డి ఇంతని ఆశలసు జంపేసేటోల్ల
పేదతల్లుల అక్కచెల్లెల శీలాన్నిచెరిచె దొరల
సేటుగాల్ల, మక్తెదార్ల, లంచగొండుల, జమీందార్ల
తోడుదొంగల సర్కారుకు కావలున్న పోలీసోల్ల

జులుం ఏందని ఎదురుతిరిగిండ్రో - ధీరుడో ఓ రైతుకూలన్నా
బందులు జరిపి సవాల్ చేసింఁడ్రో లేచిరా ఓకూలిచిన్నన్నా
అరె! తుపాకులనే గేలిచేసింఁడ్రో ధీరుడో ఓ రైతుకూలన్నా
॥బెల్లంపెల్లి॥

అణగివుండి దొక్కమాడి కుక్కలోలె చావవద్దని
అడ్డగాడ్దుల అధికారపు పల్లకీ మోసేది లేదని
మార్క్సిజము లెనినిజము మావో యోచన విధానంతో
సిర్పూరు నూరువూరున జనంపోరు మంటల్లేపితె
బలిసినోల్లు బతుకలేమని వూళ్ళువదిలి బయలుబడితే
రగల్ జెండా ఎత్తినోల్లు రాడికల్లై నిలిచి వాల్లు

భూమిగుంజి పంచుకున్నారో ధీరుడో ఓ రైతుకూలన్నా
దున్నెటోల్లయే భూములన్నారో లేచిరా ఓ కూలిచిన్నన్నా

॥రాడికల్లు॥

పల్లెపల్లెన క్యాంపులేసి చెరలబెట్టి ఫలంలేక
జనం పోరాటాలనన్ని జెయిల్లతో అరికట్టలేక
వణుకుబుట్టిన సర్కారు గూండా పోలిసోల్లు
"అదిలబాదు అడవిసింహం జనం పిడికిటి అగ్నికణము"
పెద్దిశంకర్ గూండెలోకి వెనుక చాటున తూట బేల్చితే

చెట్టుచెట్టుకు నెత్రుబారిందో ధీరుడో ఓ రైతుకూలన్నా
భూమి ఎర్రగ మొగ్గలేసిందో లేచిరా ఓ కూలి చిన్నన్నా
సిరివంచల సిల్లలెత్తింద్రో ధీరుడో ఓ రైతుకూలన్నా
మరాట్వాడల మంటైలేసింద్రో లేచిరా ఓ కూలి చిన్నన్నా

॥బెల్లంపెల్లి॥

అన్న గుండెలనుంచి చిమ్మిన ఎర్రని రక్తముతోటి
చిన్న తమ్ములు బాసచేసి ఉక్కుపిడికిళ్ళెత్తినారు
ఎదురులేని బెదురులేని ఎర్రజెండా నెత్తుకోని
రైతుకూలి దండు గట్టి బందూకులు బట్టుకోని
దొరలరాజ్యం కూలగొట్టి ప్రజలరాజ్యం తెస్తమాని

నక్సలైటు దండు సాగిందో ధీరుడో ఓ రైతుకూలన్నా
నాల్గుదిశల దారులేస్తుందో లేచిరా ఓ కూలి చిన్నన్నా
నిన్ను నన్ను కలిసి రమ్మందో ధీరుడో ఓ రైతుకూలన్నా

॥నిన్ను నన్ను కలిసి॥

# కంటిరెప్పలు కుంచించుకుపోతుంటే....!

సాగర్

కంటిరెప్పలు కాళ్ళదాకా కప్పుకోని
చేరగిలి పడిపోయినప్పుడు
కామ్రేడ్!.... నీ జ్ఞాపకాలు....
సూదుల్లా పొడుస్తుంటాయి....
నీగుండెని తివాచీగా పరిచి
వూపిరితో కుంపట్లు అంటించి
నడిచి వెళ్తున్న నీ తొలిదినాలు జ్ఞప్తికొస్తాయి....
నీ అడుగులు
చెదిరిపోయిన నా అక్షరాలకి ఆకృతి కల్గించి
అనుక్షణం నా వునికిని ప్రశ్నిస్తుంటే
కళ్ళ నీళ్ళతో
మారబోయే దృశ్యాలకోసం; మార్పుకోసం
నా కంటిపాపల మీదుగా
కదులుతున్న పాదాల చిత్రాలు వూహిస్తూ
పడ్డించిన విస్తట్లో రాళ్ళేరుకుంటున్నప్పుడు
నీవు పట్టుబడ్డవార్త నన్ను వెక్కిరిస్తుంది!

* * *

రాత్రి ఎంత బలంగా సాగినా నిద్రరాదు....
విసిరివేయబడ్డ అలలనుంచి, ఆలోచనలనుంచి
తప్పించుకోలేకపోతాను
గాలి ఎంత బలంగా వీస్తున్నా
నాకు వుక్కబోస్తూనే వుంటుంది....
జైలు గోడల మధ్య పట్టుబడి నీవూ
నిర్వ్యాపకత్వంతో సత్తగుల్లలా ముడుచుకొని నేనూ;
ఒడ్డుని ఒరుసుకుంటూ సాగిపోయే ప్రవాహ శబ్దం వింటూ
చీకటిని సరిగ్గానే అంచనా వేస్తున్నప్పుడు
నా కంటి రెప్పలు కుంచించుకు పోతుంటే
నా కుంటి నడక నాకు ఎబ్బెట్టుగా తోస్తుంది,
క్షమించు కామ్రేడ్....! క్షమించు....!!
నా చెవులు నీ వూపిరి వుష్ణం వరకూ సాచి
నీటిలో చేపలతో ఈదుకు పోతాను....!

# నాగాజాతి సమస్య

ఉదయన్ మిశ్రా

(గత సంచిక తరువాయి)

భారత నాయకులతో జరిపిన చర్చల ఫలితంగా జరిగిందేమీ లేనందువల్ల ఎన్ఎన్సి నవంబర్ 47 లో నెహ్రూకు ఒక లేఖ రాసింది. నాగాలకు తమ భవిష్యత్తును నిర్ణయించుకొనే స్వేచ్ఛ ఇవ్వబడక పోయినట్టయితే 1947 డిసెంబర్ ఆరవ తేదీనుంచి నాగాప్రజలు భారతదేశంలో భాగం కాకుండా పోతారు అని ఈ లేఖలో హెచ్చరించడం జరిగింది. దీనివల్ల రెండువైపులా పరిస్థితి మరింత తీవ్రమైంది. 1949 లో ఎన్ఎన్సి అధ్యక్షుడుగా ఫిజో ఎన్నికయ్యాక నాగా స్వాతంత్ర్య డిమాండ్ ఇంకా తీవ్రతరమైంది. ఫిజో నాయకత్వంకింద ఎన్ఎన్సి సర్వసత్తాక నాగాలాండ్ భావనకు అంకితమైన క్రియాశీల రాజకీయ సంస్థగా మారింది. భారత రాజ్యాంగంలోని ఆరవ షెడ్యూల్‌ను ఎన్ఎన్సి నిరాకరించింది. 1951 మే నుండి ఆగస్టు వరకు నాగా స్వాతంత్ర్య సమస్యపై విజయవంతంగా ప్రజాభిప్రాయ సేకరణ జరిపింది. 1952 సార్వత్రిక ఎన్నికల పూర్తి బహిష్కరణను నిర్వహించింది. ఈచర్యల తర్వాత పౌరశాసనోల్లంఘనోద్యమం మొదలైంది. ఈఉద్యమంలో భాగంగా పాఠశాలల ఉపాధ్యాయులు పెద్ద ఎత్తున రాజీనామాలు చేశారు. భారత ప్రభుత్వ కార్యక్రమాలను ప్రజలు బహిష్కరించారు. పన్నులు కట్టడానికి నిరాకరించారు. ఒకదానికంటె విజయవంతంగా మరొకటిగా సాగిన ఈ చర్యలు నాగా తెగలన్నిటికీ ఎన్ఎన్సి ప్రాతినిధ్యం వహిస్తున్నదనీ, నాగా ప్రజలు స్వపరిపాలనను కోరుతున్నారనీ ఏ అనుమానానికీ తావులేకుండా రుజువు చేశాయి.

నాగా కొండల్లో జరుగుతున్న సంఘటనల ధోరణిని గమనించని భారత ప్రభుత్వం 1953 మధ్యకల్లా ఎన్ఎన్సిపై విరుచుకు పడడానికి నిశ్చయించుకుంది. అకస్మాత్తుగా నెహ్రూ నాగా కొండలను సందర్శించి వెళ్ళగానే ఎన్ఎన్సి నాయకులపై పోలీసు చర్యలు, ముఖ్యమైన నాగా గ్రామాల్లో సోదాలు ప్రారంభమయ్యాయి. ఈచర్యలు సాయుధ శత్రుత్వానికే

దారితీశాయి. వేలాదిమంది నాగా యువకులు నాగా హోమ్‌గార్డ్ దళాల్లో చేరిపోయారు.[8] ఎన్ఎన్‌సి నిర్మాణమంతా అజ్ఞాతవాసంలోకి వెళ్లిపోయింది. ఈ విధంగా ఇక చర్చలద్వారా పరిష్కారానికి అవకాశాలు సన్నగిల్లిన తర్వాత మార్చ్ 1956 లో నాగా ఫెడరల్ ప్రభుత్వం (ఎన్ఎఫ్‌జి) ఏర్పాటయినట్టు ప్రకటన వెలువడింది.

చాలా జాగ్రత్తగా తయారుచేయబడిన ఎన్ఎఫ్‌జి నిర్మాణం నాగా గ్రామ వ్యవస్థలనుంచి స్ఫూర్తి పొందిఉండడంవల్ల అతి తక్కువ కాలంలో సమాంతర ప్రభుత్వంగా పనిచేయడం ప్రారంభించింది.[9] అభివృద్ధిచెందుతున్న ఎన్ఎన్‌సి శక్తిని అడ్డుకోవడానికై ఇంకోంగ్లిబా అవ్ నాయకత్వాన నాగాల్లోని ఒక శిష్టవర్గాన్ని విడదీసి, నాగా కొండలను కేంద్ర ప్రభుత్వ ప్రత్యక్షపాలనకిందికి తెచ్చుకునేందుకు ఢిల్లీ ప్రయత్నించింది. ఇట్లా అస్సాం లోని నాగా కొండలప్రాంతాన్నీ, ఈశాన్య సరిహద్దు ప్రాంతంలోని టుయెన్‌సాంగ్ ప్రాంతాన్నీకలిపి భారతప్రభుత్వ విదేశీవ్యవహారాలశాఖ పాలనకిందికి తెచ్చారు. నాగతెగల ఐక్యతకు, నాగా జాతీయవాదానికీ ఈ చర్య గొప్ప మేలుచేసిందని మితవాదులు భావించారు. ఎన్నో లొసుగులతోనైనా కొత్త ప్రాంతాన్ని విదేశీవ్యవహారాలశాఖకి అప్పగించడం కొంత తృప్తికరమే అయినప్పటికీ, ఇది రాజీచర్యమాత్రమేననే అభిప్రాయంతో ఎన్ఎఫ్‌జి ఈచర్యను వ్యతిరేకించింది. మొత్తానికి నాగా ఉద్యమంలో చీలిక తేవడంలో ఢిల్లీ విజయం సాధించింది. మితవాదులను పూర్తిగా తనవైపు లాక్కునేందుకుగాను 1963 డిసెంబర్‌లో నాగాలాండ్ రాష్ట్రాన్నికూడా రూపొందించింది. ఈ చర్య నాగాలను ఒకరికి వ్యతిరేకంగా మరొకరిని నిలిపే దుష్ట పథకంతప్ప మరేమీకాదని దృఢంగా ప్రతిఘటించి, పోరాటాన్ని కొనసాగిస్తానని ఎన్ఎఫ్‌జి ప్రకటించింది.

ఆ తర్వాత జరిగిన సంఘటనలన్నీ సమీపచరిత్రలోనివే. వాటిని వివరంగా చెప్పవలసిన అవసరంలేదు. ఐనా నాగా జాతీయవాదపు అభివృద్ధి గురించీ, దాన్ని భారతప్రభుత్వం ఎదుర్కొంటున్న తీరుగురించీ సరైన అవగాహన ఉండాలంటే శాంతి సంఘానికీ, ఎన్ఎఫ్‌జికీ మధ్య జరిగిన శాంతి ఒడంబడిక స్వభావాన్ని మనం పరిశీలించాలి. శాంతిసంఘం "నాగా ప్రజల స్వయంనిర్ణయాకాంక్ష"నూ, తమ జీవనవిధానాన్ని పరిరక్షించుకోవ

డానికై వాళ్ళు చేస్తున్న పోరాటాన్నీ ప్రశంసించింది. నాగాలు భారత ప్రధాన స్రవంతిలో ఎన్నడూ భాగంకారనీ, భారత ప్రభుత్వంలో భాగం కావాలా వద్దా అనేది ఎన్ఎఫ్‌జి స్వయంగా నిర్ణయించుకోవచ్చుననీ శాంతి సంఘం అంగీకరించింది. "ఎన్ఎఫ్‌జి నాయకత్వాన సాగుతున్న పోరాటం మామూలు శాంతిభద్రతల సమస్య మాత్రమే కాదనడంలో ఏ సందేహమూ లేదు. అది ఖచ్చితంగా జాతీయ స్వాతంత్ర్య పోరాటం. అది ఒక ప్రభుత్వాన్ని కూలదోయాలనుకోవడంలేదు, బలప్రయోగంద్వారా తనమీద రుద్దబడిందని భావిస్తున్నందువల్ల భారత ప్రభుత్వాన్ని ఈ పోరాటం తోసి వేయదలచుకున్నది. నాగా ప్రజలు నిస్సందేహంగా ఒకజాతి. నాగా సమస్య శాంతిభద్రతల సమస్యకాక నాగాల స్వేచ్ఛాసమస్య ఐనందువల్ల స్వయం నిర్ణయాధికార రాష్ట్రాల యూనియన్ వెలుగులో నాగా స్వాతంత్ర్య ఉద్యమాన్ని పరిశీలిస్తే అది వేరే రూపం తీసుకునే అవకాశముందని తెలియజెప్పడానికి నేను ప్రయత్నించాను" అని శాంతి సంఘం సభ్యుడు జయప్రకాశ నారాయణ్ ప్రకటించాడు. నాగా సార్వభౌమాధికారసమస్యపై ఏ రాజీలకూ లొంగిపని ఎన్ఎఫ్‌జి ఒకవైపున, భారత రాజ్యాంగం పరిధిలోనే సమస్యా పరిష్కారం కావాలని భారత ప్రభుత్వం మరోవైపునా వాదించడం ప్రారంభించినందువల్ల శాంతి సంఘ ప్రతిపాదనలు పరిష్కారాన్ని చూపలేకపోయాయి. ఐతే నాగాలు ఒక ప్రత్యేక జాతి అనే వాస్తవాన్నీ, భారతదేశంతో వాళ్ళు పెట్టుకునే ఏ సంబంధమైనా స్వచ్ఛందమైనదేననీ శాంతి సంఘం గుర్తించింది.

ఢిల్లీలో జరిగిన చర్చలన్నిటా ఈవాస్తవాన్ని అంగీకరింప జేయడానికే ఎన్ఎఫ్‌జి ప్రయత్నించింది. సమస్యను నాగా కోణంనుంచి అర్థం చేసుకోవడానికి ఢిల్లీ ఎప్పుడూ ప్రయత్నించలేదు సరిగదా, అభివృద్ధి చెందుతున్న నాగా జాతీయ వాదాన్ని కొందరు సాయుధ తిరుగుబాటుదార్లు అధికారం కోసం నడుపుతున్న వేర్పాటు ఉద్యమంగా చిత్రించిందని ఎన్ఎఫ్‌జి పదేపదే ప్రకటించింది. ఈ ప్రకటన వాస్తవమైనదే. ఈ ప్రకటన గత, ప్రస్తుత భారత ప్రభుత్వాలకే గాక వామపక్షాలతోసహా అన్ని రాజకీయపార్టీలకూ వర్తిస్తుంది. ఈ అన్ని పార్టీలకూ నాగా సమస్యను అర్థంచేసుకోవడానికి అవసరమైన దృక్పథంలేదు. నాగా సమస్యమీద అర్థవంతమైన చర్చ చేయదలచుకుంటే

మొట్టమొదట మనం ఈ ఉద్యమం ప్రాథమికంగా స్వయంనిర్ణయాధికారం కోసమని గుర్తించాలి. ఈ సమస్యకు శాంతియుత రాజకీయ పరిష్కారం దొరకాలంటే నాగా పోరాటాన్ని ఈ దృక్పథంనుంచి పరిశీలించాలి. నాగా గిరిజన గ్రామీణ ప్రజాస్వామ్యాన్ని అర్థంచేసుకో ప్రయత్నించడం, అప్పటికే ఉన్న సాంఘిక - రాజకీయ వ్యవస్థపైన ఎన్ఎన్సి తన నిర్మాణాన్నెట్లా సాగించిందో తెలుసుకోవడం అవసరం. ఈ సందర్భంలో గిరిజన సమితుల పాత్రను, నాగా జాతీయవాద స్వభావాన్నీ, సంపూర్ణ స్వయం ప్రతిపత్తి లేదా నాగా ప్రజల స్వయంనిర్ణయాధికార సమస్యలను తడమడం అవసరం.

నాగా ప్రజల స్వయం నిర్ణయాధికార డిమాండ్ను నాగా కొండల్లో చురుకుగా సాగిన క్రిస్టియన్ మిషనరీల భావజాలంతోనూ, పాశ్చాత్య విద్యా వ్యాప్తితోనూ చాలాసార్లు పొరపాటుగా ముడివేయడం జరిగింది. 'మధ్య తరగతి విద్యావంతులు' అని పిలవబడుతున్న చిన్న బృందంకూడా ఎన్నడూ బేషరతుగా పాశ్చాత్యీకరణకు అంగీకరించలేదు. క్రైస్తవమతం వల్లా, పాశ్చాత్య విద్యవల్లా నాగా యువకులకు పాశ్చాత్య స్వేచ్ఛాభావాలు అలవడ్డాయనేమాట నిజమే. వివిధ తెగలమధ్య శతృత్వం తగ్గడానికీ నాగా జాతీయవాదశక్తుల అభివృద్ధికీ ఆ భావాలు దోహదపడ్డాయనేది నిజమే. సహజంగానే ఎన్ ఎస్ సి నాయకత్వం ఈ బృందం నుంచే వచ్చింది. ఐతే గమనించవలసిన విషయమేమంటే నాగా జాతీయవాద అభివృద్ధిక్రమం మొత్తంలోనూ గిరిజన సమితుల సాంప్రదాయిక నాయకత్వానికి ఏ ముప్పూ వాటిల్లలేదు. నాగా రాజకీయ జీవితంలో గ్రామపెద్ద అంతకు ముందు ఎంత ముఖ్యుడుగా ఉన్నాడో ఆ తర్వాత కూడా అంతే ముఖ్యుడుగా ఉన్నాడు. బ్రిటిష్ పాలనా కాలంలో ఇక్కడి ప్రజల ఆర్థిక జీవితంలో ఏ పెద్ద మార్పూరాని కారణంగా గిరిజన సమితుల అధికారంలో ఏమార్పూ రాకపోవడం ఇందుకొక పాక్షిక కారణం కావచ్చు. నాగా గ్రామ రాజ్యాల్లో ఉండిన స్వపరిపాలనా ప్రజాస్వామిక పద్ధతి మరో కారణం. అందువల్లనే జాతీయవాదులైన విద్యావంతులకు, సాంప్రదాయిక ముఖ్యులకు మధ్య ఘర్షణలు రాకపోవడమేగాక, నాగా జాతీయవాదులకు సాంప్రదాయిక గిరిజన పద్ధతుల మీద ఆధారపడ్డ నాగా ప్రజాస్వామ్యం నుంచి అమితమైన తోడ్పాటు అందింది.

ఫిజో నాయకత్వాన ఎన్ఎన్‌సి గిరిజన సమితులను, ముఖ్యులను నాగా స్వాతంత్ర్య ప్రయోజనంవైపు తీసుకురావడానికి తీవ్రమైన కృషి చేసింది. ఇది సాధించడంతో ఉద్యమానికి బలమైన పునాది దొరికింది. నాగా ఉద్యమబలం గిరిజన సమితుల సహకారంలో ఉన్నదని, వాళ్ళ ప్రభావాన్ని తగ్గించాలంటే గిరిజన సమితుల అధికారాన్ని తగ్గించాలని, అంటే నాగాప్రజల ఆర్థికవిధానాన్ని, ముఖ్యంగా భూసంబంధాలను విచ్ఛిన్నం చేయాలని అర్థం చేసుకోవడానికి భారత ప్రభుత్వానికి కొంతకాలం పట్టింది. నాగాలాండ్‌లో భారతసైన్యపు పాత్రగురించి ఏమాత్రపు పైపై పరిశీలనలోనైనా తిరుగుబాటుదారులను అణచివేసే పేరుమీద నాగా ప్రజల ఆర్థిక విధానాన్నంతటినీ విచ్ఛిన్నంచేసే ప్రయత్నం జరిగిందనేది తేటతెల్లమవుతుంది. ఈ చర్యల్లో భాగంగానే గ్రామాల పునర్నిర్మాణం[10] జరిగింది. ఈ ఆర్థికవ్యవస్థా విధ్వంసం ఎంతో తీవ్రమైన పరిణామాలకు దారితీసింది. నాగా సమాజపు మౌలికఅంశమైన గ్రామ రిపబ్లిక్‌లను ఇది కదిల్చివేసింది.

భారత జాతీయవాదపు ప్రధాన స్రవంతిలోకి కొద్దికాలంకిందివరకూ రాకుండా ఉండిన అసంఖ్యాకమైన ఇతర తెగలలాగే నాగాలుకూడా 1947 తర్వాత వచ్చిన పరిస్థితికి సర్దుకుపోవాలని కొందరు వాదించవచ్చు. కాని ఇక్కడ గుర్తుంచుకోవాల్సిన విషయమేమిటంటే బూర్జువా జాతీయవాదపు ప్రవాహంలో కొట్టుకుపోయిన ఇతర తెగలకంటె భిన్నంగా నాగాలు సాంస్కృతిక, అనువంశిక ఐక్యతపై ఆధారపడిన తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కాపాడుకున్నారు. ఇందుకు కొంతవరకు వాళ్ళ భౌగోళికస్థితికూడా కారణం కావచ్చు. తెగలమధ్య సాగుతూఉండిన భయంకర శత్రుత్వంమధ్య గిరిజన ప్రజాస్వామ్యపు సాంప్రదాయం ఆధారంగా వాళ్ళు తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కాపాడుకున్నారు. తమ జీవనవిధానాన్ని నాశనంచేయడానికే భారత ప్రభుత్వం కంకణం కట్టుకున్నదనీ దాన్ని రక్షించుకోవడానికే తాము పోరాటం చేపట్టవలసివచ్చిందనీ నాగాల ఉద్దేశ్యం. నాగా గ్రామీణ ప్రజాస్వామ్యం మారదనిగానీ, మారనవసరంలేదనిగానీ ఎవరూ అనరు. అది తప్పనిసరిగా ఉత్పత్తివిధానంలోనూ, ఉత్పత్తి సంబంధాల్లోనూ వచ్చే మార్పులకు అనుగుణంగా మారుతుంది. ఐతే ఈ పరిణామక్రమాన్ని బాహ్యశక్తులు ప్రభావితంచేస్తే చేయవచ్చుగానీ ముఖ్యంగా అది నాగాసమాజంలోని వైరు

ధ్యాల ఫలితంగానే జరగాలి. జాతీయస్పృహను సమీకరించడంలో ప్రముఖ పాత్ర వహించిన సాంప్రదాయిక రాజకీయనిర్మాణాలను ఆధునికీకరించడం ద్వారా నాగాలు ఒక కొత్త ఐక్యనాగాలాండ్ నిర్మాణానికి ప్రయత్నిస్తున్నారు.

నాగా స్వయం నిర్ణయాధికారానికి వ్యతిరేకంగా ఇంకొక వాదన విన వస్తున్నది. దీనిప్రకారం నాగాలు ఒక జాతికాదు; కాకపోతే ఒక ఉపజాతిగా పిలవవచ్చు. ఇందుకు కారణాలుగా ఇరుగుపొరుగు గిరిజనులకంటే నాగాలు ఏ విధంగానూ వేరుకారని, వాళ్ళకెప్పుడూ ఒక ఉమ్మడి మతం గానీ, సంస్కృతిగానీ లేదని ఈ వాదన చెపుతుంది. కనుక జాతిగా పిలవడానికి ముఖ్యమైన యోగ్యత అయిన జాతీయ స్పృహ వాళ్ళకు లేదని ఈ వాదన చేసేవాళ్ళు తేల్చివేస్తారు. ఇంతకంటే అబద్ధమైన విషయం మరొకటుండదు. ఈ సందర్భంగా చరిత్రకారుడు ఇ. ఎ. గెయిట్ చెప్పినదాన్ని ఒకసారి పరి శీలించాలి. "ఈ సరిహద్దు ప్రాంత కొండప్రజల మత విశ్వాసాలను పరిశో ధించే వారెవరికైనా మొట్టమొదట తట్టే విషయం వాళ్ళందరినీ కలిపే ఉమ్మడి సూత్రం. ప్రతి జాతికీ, ప్రతి తెగకూ స్వంత స్వతంత్ర విశ్వాసా లున్నాయని, అవి ఇ త ర తె గ ల వారికంటే చాలా భిన్నమైనవనీ అనుకోవడంకంటే పెద్ద తప్పు మరొకటుండదు. వాస్తవాలు అందుకు విరుద్ధంగా ఉన్నాయి. శ్యామనిజం అనిగానీ, ఎనిమిజం అనిగానీ. నత్ అరాధన అనిగానీ ఏ పేరు పెట్టినా ఈ తెగల మతం వాస్తవంగా ఒక్కటే. అచరణలో ఏవైనా మార్పు లుండవచ్చు గానీ ప్రాథమిక సూత్రాలలో ఏ తేడాలూ లేవు. ఆ తేడాలు కూడా శాక్తేయులనుంచి వైష్ణ వులనూ, సాల్వేషన్ ఆర్మీ సభ్యులనుంచి యూనిటేరియన్లనూ విడదీసేంత ముఖ్యమైనవేమీ కావు. మాతృభూమిపట్ల, స్థానిక సాంప్రదాయాల పట్ల, ప్రాంతీయ అధికారులపట్ల ప్రగాఢ అభిమానం జాతీయవాద చిహ్నంగా గుర్తించేటట్టయితే నాగాలను తప్పకుండా ఒక జాతిగా పిలవవచ్చు అంతే కాకుండా తమ రాజకీయ, సాంఘిక వ్యవస్థలకు మూలమైన ఉమ్మడి జీవి తాన్ని పంచుకుంటూ నాగాలు ఉమ్మడి నాగా సంస్కృతికి మూలమైన మానసికఐక్యతను అభివృద్ధిచేసుకున్నారు. ఖచ్చితంగా ఈఅంశమే వాళ్ళను ఇరుగు పొరుగు గిరిజనుల నుంచి వేరు చేస్తుంది. నాగాలకు ఒక ఉమ్మడి భాష లేకపోవడం జాతీయవాదం పెరుగుదలకు అడ్డంకేమీ కాలేదు. ఎందు

వల్లనంటే ఉమ్మడి వారసత్వం, ప్రత్యేక భూభాగం, ఉమ్మడి రాజకీయార్థిక జీవన విధానం, ఉమ్మడి ఆచారాలు సాంప్రదాయాలకు నాగాలు తమ సంఘటిత ఆకాంక్షను జతచేశారు. ఇది జాతీయవాద అభివృద్ధికి ఎంతో అవసరమైన అంశం. తెగలమధ్య ఒంటరితనాన్ని బద్దలుచేసి, తమ సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక భవిష్యత్తు జాతీయ నిర్మాణంతో ముడిపడి ఉన్నదనే భావనను నాగా ప్రజలందరిలో కలిగించిన ఘనత ఎస్ ఎన్ సిదే.

నాగాలకు చిన్నజాతి సంకుచిత మనస్తత్వం ఉన్నదని ఒక ఆరోపణ వస్తున్నది. వాళ్ళ పోరాటం ఎవరికీ తెలియకుండా ఉన్నదనేది నిజమే. కాని నాగా స్వయం నిర్ణయాధికార డిమాండ్‌ను చిన్నజాతి సంకుచితత్వం గానో, విదేశీయులపట్ల నిర్హేతుక ఉన్మాదంగానో పొరబడగూడదు. నాగా పోరాటాన్ని గురించి చర్చించేటప్పుడు నాగాలు మొత్తంగా ఎన్నడూ భారత బూర్జువావర్గం నడిపిన బ్రిటిష్ వ్యతిరేక పోరాటంలోకి రాలేదని గుర్తుంచుకోవాలి. అలాగే వాళ్ళు మిగిలిన ఉపఖండంతో ఉమ్మడి సాంప్రదాయాన్ని కూడ పంచుకోలేదు. భౌగోళికంగా భారత ఉపఖండంలో భాగమైనప్పటికీ వాళ్ళు వాళ్ళ ప్రత్యేక జీవన విధానాన్నే అనుసరించారు. నాగా కొండల్లో బ్రిటిష్ ఆక్రమణకూడా మిగతా దేశంలో అదివేసిన ప్రభావానికి భిన్నంగా ఉంది. కనుకనే బ్రిటిష్‌వాళ్ళు భారతదేశంనుంచి వెళ్ళిపోయినప్పుడు నాగాలు ఒంటరిగా ఉండాలని భావించారు. ఈ భావనను ఎన్‌ఎన్‌సి వాడుకొని ఉద్యమం ప్రారంభించింది. ఈ ఉద్యమం భారత ఆక్రమణతో ప్రమాదం ఏర్పడగల నాగా జీవనవిధానాన్ని పరిరక్షించుకోవడానికే ఉద్దేశించబడింది. కనుకనే నాగాలు భారతదేశంతో పెట్టుకునే సంబంధం స్వచ్ఛందంగా ఉండాలని ఎన్‌ఎన్‌సి వాదించింది. వేర్పాటు వాదులనే ఆరోపణకు జవాబుగా తామెన్నడూ భారతయూనియన్‌లో భాగమేకానప్పుడు విడిపోవడమనే సమస్యే రాదని ఎన్‌ఎన్‌సి ప్రకటించింది.

ఇట్లా వాదించడంలో నాగా నాయకులకు ఐక్యంకావడానికి స్వేచ్ఛ ఉండడమంటే విడిపోవడానికి స్వేచ్ఛ ఉండడమేనని స్పష్టంగా తెలుసు. "విడిపోయే హక్కు లేకుండా జరిగే ఏకీకరణ స్వేచ్ఛగా జరిగినట్టుకాదు" అని లెనిన్ అన్నాడు. స్వీడన్ నుంచి నార్వే విడిపోవడాన్ని గురించి రాస్తూ స్వచ్ఛంద ఐక్యత గురించి లెనిన్ ఇట్లారాశాడు. "నార్వేకూ స్వీడన్‌కూ

ఉన్న భౌగోళిక, ఆర్థిక, భాషా బంధాలు గ్రేట్ రష్యన్‌లకూ ఇతర స్లావ్ జాతులకు ఉన్న బంధాలంత దగ్గరివే. కాని నార్వేకు, స్వీడన్‌కు ఉన్న ఐక్యత స్వచ్ఛందంగా ఏర్పడ్డది కాదు. నార్వేజియన్ల ఆకాంక్షలకు వ్యతిరేకంగా చక్రవర్తులు నెపోలియన్ యుద్ధాల సమయంలో నార్వేను స్వీడన్‌కు ధారాదత్తంచేశారు. నార్వేను లొంగదీసుకోవడానికి స్వీడ్లు సైన్యాలను పంపవలసివచ్చింది" నాగా ఫెడరల్ ప్రభుత్వం కూడా ఇదే వాదనను చేపట్టింది. తమను భారత ప్రభుత్వ పాలనకిందికి తోయడానికి బ్రిటిష్‌వాళ్ళకు ఎంత మాత్రమూ హక్కు లేదని, భారతదేశంతో తమ భవిష్యత్ సంబంధాలను నిర్ణయించుకునేహక్కు తమకు మాత్రమే ఇవ్వబడాలని ఎన్‌ఎఫ్‌జి వాదిస్తున్నది.

మొత్తం ఈశాన్య ప్రాంతంలో నివసిస్తున్న ఎన్నో జాతుల్లో ఒక్క నాగాలు మాత్రమే ఈ డిమాండ్ ఎందుకు లేవనెత్తుతున్నారన్న ప్రశ్న రావచ్చు. కొద్దికాలం కింది వరకూ ఈ ప్రశ్నకు సమాధానాన్ని "విదేశీమిషనరీలు ప్రచారంచేసిపెట్టిన వేర్పాటువాద భావాల్లో" వెతికే ప్రయత్నం జరిగింది. కాని వాస్తవంవేరు. బ్రిటిష్ పాలనకింద నాగాలు కొద్దికాలమే ఉన్నారన్న వాస్తవాన్ని పక్కనపెడితే మనం గుర్తుంచుకోవాల్సిన విషయమేమంటే సాంప్రదాయిక భూసంబంధాలు ముట్టుకోబడకపోవడంవల్ల బ్రిటిష్ ఆక్రమణ కింద నాగాసమాజం దాదాపు ఏమార్పుకూ గురికాలేదు. భూస్వామ్యం కంటే హెచ్చుగా గిరిజన స్వభావం కలిగివున్న నాగా గ్రామం తన మనుగడను కొనసాగించింది. మార్కెట్ ప్రవేశించలేదు. పెట్టుబడిదారీ సంబంధాలు ప్రవేశించలేదు. అందువల్ల సహకారం మీద ఆధారపడ్డ గ్రామీణ సమాజం చెక్కుచెదరకుండా నిలిచింది. రెండో ప్రపంచయుద్ధ కాలంలో కోహిమాతోసహా నాగాలాండ్‌లో కొంత ప్రాంతం యుద్ధం అనుభవించవలసి వచ్చినపుడు నాగా ప్రాంతానికి మిగిలిన ఉపఖండంతో సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. మిగిలిన ఉపఖండంలో జాతీయవాదం పెరుగుదలకు దోహదం చేసిన రవాణాసౌకర్యాలు, రైల్వేలు నాగాలాండ్‌కు ఏమాత్రం పనికిరాలేదు. అట్లాగే నాగా జాతీయ భావనను పెంపొందించడంలో మధ్యతరగతి పాత్ర ముఖ్యమైనదైనప్పటికీ ప్రధానమైన దేమీ కాదు. అందువల్ల నాగా జాతీయవాదపు మొత్తం శక్తి గిరిజన జీవన విధానంలోనే ఉన్నదని, అది గిరిజన సమితులద్వారా, వివిధ నాగా తెగల ముఖ్యుల ద్వారా వ్యక్తీ

కరించబడిందని చెప్పవచ్చు. నాగాలు ఎల్లప్పుడూ నాగాజీవన విధానాన్ని రక్షించుకోడానికే పోరాటాలు చేపట్టారు ఖచ్చితంగా ఎన్ ఎన్ సి కూడా ఈ భావన ఆధారంగానే వివిధ తెగల మధ్య వంతెనలు వేసింది. నాగా జాతీయవాదపు ఉమ్మడి నినాదం కింద వాళ్ళను ఏకం చేసింది.

అధికారికంగా ఎన్‌ఎన్‌సి ఇంకా స్వతంత్ర నాగాలాండ్ డిమాండ్‌కు కట్టుబడిఉంది. కాని పరిస్థితులు, రాజకీయావసరాలు నాగా సమస్యకు శాంతియుతపరిష్కారం ఆలోచించేదిశలో ఎన్‌ఎన్‌సిని ఒత్తిడి చేస్తున్నాయి. దీంతో భారతదేశంలో కలిసిఉంటూనే స్వతంత్రప్రతిపత్తి కావాలనే ఆలోచన తలెత్తింది. వర్తమాన రాజకీయ పరిణామాలదృష్ట్యా కేంద్ర రాష్ట్ర సంబంధాల విషయంలో జాతీయచర్చకై మిగిలినపక్షాలతోసహా సిపిఐ (ఎం) ఇచ్చిన పిలుపుల వెలుగులో ప్రాంతీయ, స్థానిక, స్వతంత్రప్రతిపత్తి ఆలోచన ప్రాముఖ్యతను సంతరించుకున్నట్టు కనబడుతున్నది. దేశాయ్, ఫిజోల మధ్యన జరిగిన చర్చలు విఫలమైనప్పటికీ స్వతంత్ర ప్రతిపత్తిగల నాగాలాండ్ గురించి శాంతియుతపరిష్కారం విషయమై నాగా అజ్ఞాతప్రభుత్వం తన ప్రయత్నాలను వదిలిపెట్టలేదు.

నాగా ఉద్యమం మొదటిదశల్లో ఇండియన్ యూనియన్‌నుంచి విడిపోయే డిమాండ్ ప్రధానంగాలేదని గమనించాలి. భారతప్రభుత్వం నాగాల ఆకాంక్షలను అర్థంచేసుకో ప్రయత్నించకుండా అణచివేత విధానాన్ని చేపట్టినతర్వాతనే నాగాలు వేర్పాటు ఆలోచన మొదలుపెట్టారు. జాతీయ సమానత్వంఅంటే ప్రాంతీయ స్వతంత్రప్రతిపత్తిఅనీ, సంపూర్ణప్రజాస్వామిక స్వపరిపాలనఅనీ, ఈ స్వపరిపాలక, స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రాంతాల సరిహద్దులు స్థానికప్రజలచే నిర్ణయించబడాలనీ, ఈ నిర్ణయానికి ఆర్థిక, రాజకీయ పరిస్థితులు, ప్రజానీకపు జాతీయస్పృహ పునాదిగా ఉండాలని లెనిన్ చెప్పిన విషయం గుర్తుంచుకోవడం ఈ సందర్భంలో ఎంతో అవసరం.

## పాదసూచికలు

1. ప్రస్తుత నాగాలాండ్ రాష్ట్రం 16,488 చ.కి.మీ. విస్తీర్ణం కలిగి ఉంది. ఐతే ఈ రాష్ట్రం విధేయులైన నాగాలకుగానీ, అజ్ఞాత నాగాలకుగానీ ఆమోదయోగ్యం కాదు. నాగాలాండ్‌లో చిండ్విన్ నుంచి బ్రహ్మ

పుత్ర వరకు గల నాగా నివాసప్రాంతాలన్నీ ఉండాలని వాళ్ళు కోరు తున్నారు. ప్రస్తుత నాగాలాండ్ జనాభా అయిదు లక్షల పదహారువేలు. అయితే మొత్తం నాగాల జనాభా పదిలక్షలవరకూ ఉండవచ్చు.

2. నాగా కొండలజిల్లా నాగాలాండ్‌లోని మధ్యప్రాంతాన్ని మాత్రమే ఆవ రించి వుంది. దాన్లోకి ఇతర నాగా నివాస ప్రాంతాలురావు. ఇట్లా ప్రత్యే కంగా నాగా కొండలజిల్లా ఏర్పరచడం నాగాలను విభజించి పాలించ డానికేనని నాగా మేధావుల అభిప్రాయం.

3. కొనొమా ఫిజో పుట్టిన ఊరు. నాగా కొండల్లో అతి పెద్దదైన ఈ గ్రామ రాజ్యం ఎందరో నాగా మేధావులకు, విప్లవకారులకు, సంఘ సంస్కర్త లకు పుట్టినిల్లు.

4. గిడిన్‌లియు నాయకత్వాన నాగాలు చేసిన జెలియాంగ్ రాంగ్ పోరాటాన్ని జాతీయోద్యమంలో భాగంగా ప్రచారంచేసి భారత జాతీయ కాంగ్రెస్ నాగాలు జాతీయోద్యమంలో పాలు పంచుకున్నారని వాదిస్తున్నది. ఐతే గిడిన్‌లియు పోరాటం ప్రధానంగా ఆమె తెగకు సంబంధించిందే, తెగల మధ్య శత్రుత్వానికీ, క్రైస్తవ వ్యతిరేకతకూ, ఆటవిక ఆచారాల పున రుద్ధరణకూ పరిమితమైందే.

5. నాగాక్లబ్ 1918లో స్థాపించబడింది. నాగాలందరి అభిప్రాయాన్ని సమీకరించే ప్రయత్నం చేసిన మొట్టమొదటి సంస్థ అది.

6. నాగాప్రజల పదిసంవత్సరాల మధ్యంతర ప్రభుత్వంగురించి తనసూచన లను ఎన్ఎన్‌సి ఇట్లా తెలియజేసింది.

(i) మధ్యంతర ప్రభుత్వం నాగాప్రజల ప్రభుత్వం. శాసననిర్మాణం లోనూ, పాలనలోనూ, న్యాయవ్యవస్థలోనూ ఈ ప్రభుత్వానికి సం పూర్ణాధికారాలు ఉంటాయి.

(ii) నాగాలాండ్ నాగాప్రజలకు చెంది ఉంటుంది. ఇతరులు స్వంతం చేసుకోవడానికి వీల్లేదు.

(iii) ఆదాయం, ఖర్చువిషయాల్లో మధ్యంతర ప్రభుత్వానికి పూర్తి అధి కారాలుంటాయి. అయితే లోటుపూరించుకోవడానికిగాను ప్రతి ఏటా సంరక్షకదేశం కొంత సహాయం చేయాలి.

(iv) రక్షణావసరాలకోసం, అత్యవసరపరిస్థితిలో పౌర అధికారానికి సాయపడడంకోసం అవసరమవుతుందని ఎన్ఎన్సి భావించినంత సంరక్షకదేశపు సైన్యం నాగాలాండ్‌లో ఉంటుంది. ఈ సైన్యం ఎన్ఎన్సికి జవాబుదారీఅవుతుంది. ఎన్ఎన్సి సంరక్షకదేశానికి జవాబుదారీ అవుతుంది.

7. ఎనిమిదో ప్రకరణంలో ఇట్లావుంది. "భారతప్రభుత్వ ప్రతినిధిగా అస్సాం రాష్ట్రగవర్నర్‌కు ఒప్పందం పదేళ్ళపాటు సరిగా అమలయేట్టు చూడ వలసిన ప్రత్యేక బాధ్యతవుంది. పదేళ్ళతర్వాత ఒప్పందాన్ని మరికొంత కాలం పొడిగించే విషయమై నాగా నేషనల్ కౌన్సిల్‌ను సంప్రదించడం జరుగుతుంది. లేదా భవిష్యత్తుకొరకై ఒక కొత్త ఒప్పందం చేసుకోవడం జరుగుతుంది."

8. నాగా హోమ్‌గార్డ్ దళాలను మాజీసైనికులతోనూ, యువకులతోనూ ఫిజో నిర్మించాడు. ఫెడరల్ నాగా సైన్యానికి ఇది తొలిమెట్టు. నాగా యూత్ మూవ్‌మెంట్, నాగా విమెన్స్ సొసైటీ అనేవి ఎన్ఎన్సి యువ విభాగాలు.

9. ఫెడరల్ ప్రభుత్వ రాజ్యాంగం ఇట్లాప్రకటించింది. "నాగాలాండ్ ప్రజల సర్వసత్తాక గణతంత్రరాజ్యం. ఇది ఎంతో కాలంనుంచి ఇట్లాగే వుంది. నాగాలాండ్‌కు వందమంది తాతార్‌లతోకూడిన పార్లమెంట్ వుంటుంది. అధ్యక్షుణ్ణి ప్రజలు ఎన్నుకుంటారు. మంత్రివర్గంలో పదిమంది కిలోన్సెర్ (మంత్రి)లు వుంటారు" మతస్వేచ్ఛనూ, స్త్రీ పురుష సమానత్వాన్నీ గ్యారంటీ చేసిన ఈ రాజ్యాంగం ఇంకా ఇట్లా ప్రకటిస్తుంది. "భూమి ప్రజలందరిదీ. ఇక ముందుకూడా అట్లాగే వుంటుంది. భూమి శిస్తేమీ వుండదు. వివిధ పాలనా విభాగాలు ఇతర రకాల పన్నులు తయారుచేస్తాయి."

10. గ్రామాల పునర్నిర్మాణంలో వివిధగ్రామాలప్రజల్ని ఒక చోటికి తేవడం వల్ల వాళ్ళు తమభూములనుంచి వేరైపోయారు. 'విద్రోహులకు' ఆహారం, ఆశ్రయం ఇచ్చి సహాయపడకుండా చేయాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఈ చర్య తీసుకుంది. ఈ పునర్నిర్మాణంవల్ల నాగాలు చెప్పలేని బాధలుపడ్డారు. ముఖ్యంగా ఇందువల్ల నాగా గిరిజన జీవితానికి ప్రాణప్రదమైన గ్రామవ్యవస్థ ధ్వంసమైపోయింది.

# కంట్రోల్ ది కంప్యూటర్

హెచ్చార్కె

[1981 జులై 24 "ఆంధ్రజ్యోతి"లో అచ్చయిన అజంతా "కంప్యూటర్ చిత్రాలు" చదివి....]

డియర్ అజంతా !

నీతో కరచాలనం చేయాలని వుంది
"కంప్యూటర్ చిత్రాలు" గీసినందుకు
కాని, నీ చేతిలో సందేహాల శైత్యం
నువ్వు నిజంగా పెద్దపులి గుండెలలో
కత్తులు విసుర్తున్న వాళ్ళలో లేవు
ఉంటే, నీ హస్త స్పర్శలో వెచ్చదనముండాలి.

కన్నీళ్ళలో దీపం వెలుగదు
దానికి నెత్తురు జలపాతాల క్రింద
తిరిగే జీవన చక్రాలు కావాలి
మన రక్తసిక్త అధరాల మీద పేరిన
నెత్తురు మనమే నాక్కుంటూ కూచోడం కాదు
ఎర్రని గీతాలు పాడుతూ, శతఘ్నుల్ని ధిక్కరించాలి

నిత్యం అదే గడియారమా నీక్కనిపిస్తోంది?
గడియారంలో ముళ్ళు కరవాలాలు కావడం చూళ్ళేదా?
లే అజంతా, రా అజంతా
ఈ నిరాశల, సందేహాల
పన్నీటి జలకాల్లోంచి యిక లే

మనం ఇక్కడుండలేం
నీకు నువ్వూ; నాకు నేనూ; పరస్పరం
అపరిచితులుగా ఎవరుమాత్రం ఎన్నాళ్లు....
చిత్రం తిరగేసి చూడు
మనిషిని సరుకుగా మార్చిన దుర్మార్గాన్ని చూడు

అంటావుగానీ, నువ్వు అగ్నితో మాట్లాడడంలేదు

నివురుతో మాట్లాడుతున్నావు.
ప్రశ్నకు ప్రశ్నను సమాధానం చేసినచోట ఆగకు
ప్రశ్నమీది ప్రశ్నకు సమాధానం దిశగా నేటి జీవన క్షేత్రం
అసలిది క్షేత్రం కాదు, ప్రవాహం

రెండు జండాలుగా చీలిన నీ ప్రతిబింబం వెనుక
ఉవ్వెత్తున లేచిన మనిషిని నువ్వు సరిగ్గా చూళ్ళేదు
తొందరపడి, అలవాటులో అలవాటుగా
అస్తంగత సూర్య సౌందర్య స్నానంలో మైమరిచావు
మృత్యువన్నది లేదు
మనిషి విజృంభణ
నిషిద్ధనగరాంతర క్రోధాగ్నినేత్ర సమీకరణోత్సాహమే
సరిగ్గాచూడు అజంతా!
మనిషి శిలావిగ్రహంగా మారడంలేదు, మారలేడు
ముఖం వెనుక ముఖానికి, భూస్థాపిత సూర్యోదయాలకి
ఎవర్నయ్యా తప్పుపడతావు ?
రాంగ్ నెంబర్! డయల్ కరెక్ట్
ఆకలి విషకౌగిలిలో రహస్య సముద్రాల హోరే విన్నావు
కబంధ హస్తాల్ని నరుకుతున్న శ్రామికున్ని చూడు.
"దృశ్యం మారకపోతే నిష్క్రమణ.... లేదా...."
అవాంఛనీయమేకాదు, అవకాశమేలేని ప్రత్యామ్నాయమిది
మనిషి ఎప్పుడూ ఖడ్గధారియే
అనంత శూన్యమూ లేదు
శాశ్వత విశ్రాంతీ లేదు
విక్రాంతి శాశ్వతం
విశ్రాంతి ఓ చిట్టి మజిలీ

నీ వేదన నే నెరుగుదును
నడివీధిలో జీవన బీభత్సాన్ని ఆవిష్కరిస్తున్నది
తనకు తానే అపరిచితుడైన మనిషికాదు
వాడు; అందమైన ఆచ్ఛాదనం వెనుక

భీభత్స కరస్పర్శ చేస్తున్న రాక్షసుడు
వాడివి కరెన్సీ కాగితాల కోరలూ, గోళ్ళూనూ
వాడిని ఖండించడానికే ఖడ్గం
పులినోరు వేరే ఎక్కడుందో చెబుదూ
శూన్యంలో కత్తులుదూస్తే యుద్ధంలో గెలువలేం
డాన్‌క్విగ్జోట్ కేవలం హాస్యపాత్ర
నిజం వీరుడనుకున్నావులాగుంది నువ్వు
అసురసంధ్య రాత్రివంతెన మీంచి నడిచి
చీకటి కన్నీటి నదిని తరించి
ఉషస్సంధ్య అవుతుంది.
సుడిగాలిలో ఎండుటాకుల ధ్వనివింటూ
చెట్టుక్రింద దిగాలుగా అలా కూచోకు
చెట్లుచిగిరిస్తున్న కొత్త ఆకుల్లో
నీ కళ్ళద్దాలు మర్చిపోయావు, వెదుక్కో
వేయి ఖండాలుగా నరకబడ్డ ఆశను నాటి
వేయి ఆశల్ని మొలకెత్తించుకోవాలి మనం

నీడతోకాదు, రూపంతో
శూన్యంతోకాదు, వస్తువుతో
నివురుతోకాదు, నిప్పుతో మాట్లాడాలి మనం
కంప్యూటర్ అందించే యాంత్రిక చిత్రాల్ని
డీకోడ్‌చేసి పెడితేచాలదు
కంప్యూటర్ నీమీద కంట్రోల్ చెయ్యడంకాదు.
కంప్యూటర్‌ను నువ్వు కంట్రోల్ చెయ్యాలి
చిత్రాన్ని తిరగేసి సరిగ్గాచూసి, దాన్నిమార్చాలి

[ఈ కవితలోని చాల పదబంధాలు అజంతావే]

# పుస్తక స్వీకారం

1. ***అగ్నిపూలు*** - కవితా సంకలనం. సంపాదకుడు : కే. స్వయంప్రకాశ్. (ఫిబ్రవరి 1982), 16 పేజీలు, 1/8 క్రౌన్, వెల : ఎనభై పైసలు. ప్రతులకు : అగ్నిపూలు, 6-12-21, నామ్‌దేవ్‌వాడ, నిజామాబాద్-503 002.

2. *గుండెచప్పుళ్ళు* - కవితల సంపుటి. ఆసురాజేంద్ర. గురజాడసాహితి, అమలాపురం సమర్పణ (డిసెంబర్ 1981), 92+22+4 పేజీలు, 1/8 క్రౌన్, వెల రు. 7-00, ప్రతులకు: శ్రీశ్రీ పబ్లికేషన్స్, స్టుడియో బలరాం, అమలాపురం-533 201.

3 *భారతీయ వ్యవసాయోత్పత్తివిధానం ఎటువైపు?* పరిశీలనావ్యాసాలు-1 డానియెల్ థార్నర్, జార్జిరెడ్డి పబ్లికేషన్ ట్రస్టు, హైదరాబాద్ ప్రచురణ, 16 పేజీలు, 1/8 డెమ్మీ, వెల : 0-25 పైసలు, ప్రతులకు : జార్జిరెడ్డి పబ్లికేషన్ ట్రస్ట్, ప్లాట్ నం. 81, జూబిలీహిల్స్, హైదరాబాద్-500 034.

4. *ఆంధ్రుల సంస్కృతి, చరిత్ర-II,* కంభంపాటి సత్యనారాయణ, సంక్షిప్తానువాదం : మహీధర రామమోహనరావు, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ (మార్చ్ 1982), పేజీలు: 354+**XXIV**, 1/8 డెమీ, వెల : రు. 14-00.

5. *జైత్రయాత్ర*-జనరల్ చూటే జీవితపథం-ఎగ్నెస్‌స్మెడ్లీ, తెలుగు : సహవాసి, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ (జనవరి 1982), పేజీలు: 380+**XIV**, 1/8 డెమీ, వెల : రు. 12-00. ఈ రెండు పుస్తకాలూ ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 3-6-694, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500 029.

6. *గోర్కీకథలు* - అనువాదం : కొమ్మారెడ్డి కేశవరెడ్డి, ఐక్యఉపాధ్యాయ ప్రచురణలు, విజయవాడ (మార్చ్ 1982), పేజీలు ; 120, 1/8 క్రౌన్, వెల : రు. 5-00, ప్రతులకు : ఐక్యఉపాధ్యాయ ప్రచురణలు, విజయవాడ-520 002.

7. ***జయభేరి***- ఏలూరు కళాశాలల విద్యార్థుల కవితాసంకలనం. సంకలనకర్త : బండ్లమూడి సత్యనారాయణ, ఇందుమతీప్రచురణలు (మార్చ్

1982). 52+XII+8, 1/8 డెమీ, వెల : రు. 8-00. ప్రతులకు : ఇందుమతీ ప్రచురణలు, నరసింహారావుపేట, ఏలూరు-534 006.

8. **అగ్నిపుష్పాలు**-జంగా, ఎస్వీ, రాజూరి, హరనాథ్, గొట్టిపర్తి-మినీకవితా సంకలనం. సాంస్కృతీ సమాఖ్య, హైదరాబాద్ ప్రచురణ (మార్చి 1982), పేజీలు 50+4. 1/8 డెమీ, వెల : రు. 4-00, ప్రతులకు: అడ్వైజర్, సాంస్కృతీ సమాఖ్య, 18-6-867, బాలాగంజ్, హైదరాబాద్-500 253.

9. *మానవ నాగరికతాభివృద్ధిలో విజ్ఞానశాస్త్రం*- డా॥ కె. బాలగోపాల్. (జనవరి 1982) పేజీలు : 12, 1/8 డెమ్మీ, వెల 30 పైసలు, ప్రతులకు : సి హెచ్. జక్కిరెడ్డి, కన్వీనర్, స్టడీ సర్కిల్, మల్లంపల్లి-506 342.

10. *ఆదిమకాలమునాటి సామాజిక చరిత్రే వేదములు* - ప్రథమ భాగం-పెండ్యాల లోకనాథం (1981), పేజీలు 46 + X, 1/8 క్రౌన్, వెల రు. 8-00. ప్రతులకు : విజ్ఞాన ప్రచురణలు, 3/17, బ్రాడీపేట, గుంటూరు-522 002.

## రచనల కోసం విజ్ఞప్తి

ఆర్థికఇబ్బందులు, నిర్వహణా సమస్యలతోపాటు సృజన రచనల విషయంలోకూడ తీవ్రమైన కొరతను ఎదుర్కొంటున్నది. కళావిలువలులేని నినాదప్రాయమైన పాటలు, కవితలు, మూసలో పోసిన ఫార్ములాపద్ధతి కథలు, ఇతర భాషల్లోని మంచిరచనలకు (చెడ్డ) అనువాదాలుతప్ప మౌలికమైన ఉత్తేజకరమయిన కనీసం తృప్తికరమైన రచనలు రావడంలేదు. ముఖ్యంగా సమీక్షలు, మౌలికమైన సృజనాత్మక రచనలు కరువయినాయి. ఉత్తమమైన రచనలు పంపించి ప్రజాసాహిత్య ప్రమాణాలు ఉన్నతంగాకాపాడడంలో సృజనకు ఇతోధికంగా సహకరించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

—'సాహితీ మిత్రులు'

దృక్పథం :

# 'రగులుకొనే రాక్షసిబొగ్గు'- జాతుల సమస్య

కె. ప్రసాదరావు

"రగులుకునే రాక్షసిబొగ్గు: ఈశాన్యభారత రాజకీయార్థిక పరిచయం" అనే సురాగారి పుస్తకాన్ని అశాస్త్రీయమైన పరిచయంగా పేర్కొంటూ 1981 ఆగస్టు సృజనలో కె. బాలగోపాల్‌గారు ఒక వ్యాసంరాశారు. ఆ వ్యాసాన్ని విమర్శిస్తూ పృథ్విగారు 1981 అక్టోబర్ సృజనలో మరో వ్యాసంరాసారు. తిరిగి అదే సంవత్సరం డిసెంబరు సృజనలో కె. బాలగోపాల్‌గారు తమ వాదనను సమర్థించుకుంటూ పృథ్విగారి వ్యాసానికి జవాబు రాసారు.

సురాగారు, పై ఇద్దరూ మార్క్సిజం-లెనినిజాన్ని మార్గదర్శకంగా ఆమోదించినవారే. వారివారి వ్యాసాలే అందుకు నిదర్శనం అయినప్పటికీ అందులో సురా, పృథ్విగార్లు అస్సాం ప్రజల పోరాటాన్ని ఈనాటి భారత ప్రజాస్వామిక విప్లవానికి అనుకూలమైనదిగానూ, న్యాయసమ్మతమైందిగానూ సమర్థనీయ మయినదిగానూ భావిస్తే, బాలగోపాల్‌గారు ఆ పోరాటాన్ని సమర్థిస్తూ రాసినందుకు సురాగారిని "వర్గపోరాట దృక్పథం వదిలిపెట్టి, జాతుల 'బలహీన బంధాలసంకెళ్ళ సంగీతానికి' తన్మయత్వం పొందడం బూర్జువా సాంస్కృతికసాపేక్షవాదానికి (Cultural Relativism) తగునేమో గాని మార్క్సిజానికి తగదు"ని విమర్శించారు.

ఒకే అవగాహన కలిగి, ఒకే ప్రాపంచిక దృక్పథాన్ని మార్గదర్శకంగా స్వీకరించిన ఇరువురు ఒకే విషయంపై పరస్పర విరుద్ధమయిన నిర్ణయాలకు రావడం సంభవమా? అసంభవం మాత్రం కాదు. ఆ విషయానికి సంబంధించిన సాధారణ అవగాహన ఇరువురిలోనూ ఒకేరకంగా ఉన్నప్పటికీ, సామాజిక పరిణామక్రమంలో స్థల, కాల, పరిస్థితులకు అనుగుణ్యంగా ఆ విషయం చెందే పరిణామక్రమానికి సంబంధించిన నిర్దిష్ట సమాచారంపట్ల ఏకాభిప్రాయంలేని సందర్భాలలో వారిలో భిన్నాభిప్రాయాలు తలఎత్తవచ్చు. అలాగాక స్థూలంగా ఒకవిషయంపట్ల అలాంటివారు ఏకాభిప్రాయం కలిగి యున్నప్పటికీ, ఆ విషయానికి చెందిన పలుకోణాలకు సంబంధించి సమగ్రమైన, నిర్దిష్టమైన సమాచారం, అవగాహన లోపించినప్పుడుకూడా

వారిమధ్య ఆ విషయాన్ని గూర్చి భిన్నభిన్న పరిష్కారమార్గాలు వ్యక్తంకాక తప్పదు.

భారతదేశంలో జాతుల సమస్యపట్ల మార్క్సిజం-లెనినిజం - మావో ఆలోచనను మార్గదర్శకంగా స్వీకరించిన విప్లవకారులు ఈనాడు అలాంటి ఇబ్బందికే గురి అయి వున్నారు. "ప్రతి జాతికీ విడిపోయే హక్కుతో సహా స్వయం నిర్ణయాధికారం వుండాలి" అనేది విప్లవకారులకు చెందిన ప్రతి గ్రూపువారి కార్యక్రమంలోనూ వుంది. కాని జాతులకు సంబంధించిన సమస్యలు నిర్దిష్టంగా ఉత్పన్నమయిన ప్రతి సందర్భంలోనూ వారి మధ్య విభేదాలు తీవ్రంగా తలఎత్తుతూనే వచ్చాయి. ప్రత్యేక తెలంగాణాకొరకు జరిగిన పోరాట సందర్భంగా ఆంధ్రప్రదేశ్‌లోని ప్రధానమయిన విప్లవ గ్రూపులు మూడూ మూడు వైఖరులు తీసుకున్నాయి. అలానే ఈనాడు అస్సాం ప్రజలు కొనసాగిస్తున్నవీరోచితపోరాటంపట్ల దేశవ్యాపితంగాఇంతో అంతో నిర్మాణం బలం కలిగియున్న విప్లవకరపార్టీల, గ్రూపులమధ్య తీవ్ర విభేదాలున్నా యనే విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు.

అయితే వాస్తవానికి అస్సాంలో ఈ పార్టీలకు గ్రూపులకువున్న బలం నామ మాత్రమైనది కనుక, ఆ పోరాటం ఎడల నిర్దిష్ట వైఖరిని ప్రకటించకుండానే లేదా అందులో నిర్దిష్టమయిన పాత్ర వహించకుండానే ఏదో విధంగా నెట్టుకొనిపోతున్నాయి. కాని అలాంటి ఎస్కేపిజం (తప్పించుకు తిరిగే ధోరణి) గాని, ప్రాప్తకాలజ్ఞత (ప్రత్యక్షంగా మనకు సమస్య ఎదురు అయినప్పుడు ఆలోచించుకుందాములే అనే సాచివేత ధోరణి) గాని ఎల్ల కాలానికి సాధ్యమా? సమస్యలను అలా తప్పించుకోవడమే అలవరచుకుంటే కార్మిక వర్గం బహు జాతులకు నిలయమయిన భారతదేశ ప్రజాస్వామిక విప్లవానికి నాయకత్వం వహించగలదా? అసంభవం. అందువల్ల జాతుల సమస్య పరిష్కారంపట్ల గానీ, జాతుల సమస్యను ప్రపంచ సోషలిస్టు మహా విప్లవంలో భాగంగా భారత ప్రజాస్వామిక విప్లవంతో జోడించి పరిష్కరించే నిర్దిష్ట విధానాలపట్లగానీ, సరయిన మార్క్సిస్టు-లెనినిస్టు అవగాహన లోపించడం మనదేశంలో కార్మిక వర్గనాయకత్వం యొక్క బలహీనతలను వ్యక్తంచేసే అనేక అంశాలలో ఒకటి అని అంగీకరించకతప్పదు.

పై లోపం మూలంగానే ఒకే ప్రాపంచిక దృక్పథాన్ని మార్గదర్శకంగా

స్వీకరించియున్నప్పటికీ, పైరచయితలు అస్సాం ప్రజల పోరాటంపట్ల పర స్పర విరుద్ధమయిన అభిప్రాయాలకు రాగలిగారు. ఇలాంటి సందర్భాలలో ఎవరికివారే అప్పటికి తమకు తోచినదే సరిఅయినదనే అంతిమనిర్ణయానికి వచ్చి, ఎదుటివారి అవగాహనను ఖండించే సందర్భం లో ఏవేవో దురుద్దేశా లను ఆపాదించడమూ, విపరీతార్థాలుతీసి అపహాస్యంచేయబూనుకోవడమూ మంచిదికాదు. అలాంటిది సమస్యను పరిష్కరించుకోడానికి తోడ్పడదు సరికదా, చర్చ పక్కదారిపట్టి అసలు సమస్య మరుగునపడిపోయే ప్రమా దానికికూడ తోడ్పడవచ్చు.

క్లిష్టతరమయిన ఇలాంటి సమస్యలపై వాదోపవాదాలు ఆరంభమయి నప్పుడు, చర్చల తీవ్రతలో, ఎవరి వాదంలో వారికుండే బలమయిన విశ్వా సంకొద్దీ, అలాంటిపద్ధతులు సాధారణంగా చోటుచేసుకునే అవకాశంవుంది. అయినప్పటికీ ఈ చర్చలో ఇది ప్రధానవిషయంకాదు.

చిత్తశుద్ధిగల మార్క్సిస్టు - లెనినిస్టు విప్లవకరపార్టీలు, గ్రూపులుకూడ ఈ విషయంలో ఎస్కేపిస్టుధోరణిని (తప్పించుకుతిరిగే ధోరణి) అవలంబి స్తున్న సమయంలో, అలా తప్పించుకుతిరిగేవారిలో చాలామంది భావిస్తున్న నమ్ముతున్న విషయాలనే ఆధారం చేసుకొని, అస్సాం ప్రజల పోరాటం సమర్ధనీయమా ? కాదా ?; అది భారత ప్రజాతంత్ర విప్లవానికి దోహద కారియా ? లేక అనర్ధదాయకమా?; భారతప్రజాతంత్ర విప్లవానికి సారధ్యం వహించవలసియున్న కార్మికవర్గం, ఆ పోరాటం ఎడల ఎలాంటి వైఖరి వహించాలి ? వగైరా భారత ప్రజాతంత్ర విప్లవాన్ని ఎదుర్కొన్న అతి ముఖ్యమయిన సమస్యలను చర్చనీయాంశాలుగాజేసి, సురా పుస్తకంపై విమర్శను అవకాశంగా తీసుకొని వ్యాసం రాయడంద్వారా ఆంధ్రపాఠక లోకం ఆ సమస్యపై దృష్టినిలిపి, తీవ్రంగా ఆలోచించడానికి తోడ్పడగల కె. బాలగోపాల్ గారి ప్రయత్నం హర్షదాయకం. అందుకు వారికీ, భారత ప్రజాతంత్ర విప్లవోద్యమంలో చాలా కీలకమయిన స్థానమాక్రమించుకొని యున్న జాతుల సమస్యలో భాగంగా ఆరంభమయిన ఈ చర్చకు తగిన ప్రాముఖ్యత ఇచ్చి, ఈ సమస్యపై కూలంకషమయిన వాదప్రతివాదాలు కొనసాగించడంద్వారా పాఠకలోకంలో మార్క్సిస్టు విజ్ఞానాన్ని పెంపొందిం పడానికి జాతులసమస్య పరిష్కారంలో ఎదుర్కొంటున్న చిక్కుముడులను

విప్పడంద్వారా భారత ప్రజాతంత్ర విప్లవ పురోగమనాన్ని సుగమంచేయ డానికి తమ పత్రికను చర్చావేదికగాసిద్ధపరిచిన సృజన 'సాహితీమిత్రుల'కూ ధన్యవాదాలు.

అయినప్పటికీ 'సృజన సాహితీ మిత్రులు'గాని, తదితర మార్క్సిస్టు లెనినిస్టు విప్లవభావాలు కలవారుగాని ఆశించినట్లుగా విస్తృతప్రాతిపదికపై ఈ చర్చ కొనసాగలేదు. చర్చ ఆరంభమయి ఆరుమాసాలు గడిచిపోయినా ఇంతవరకు పృథ్వీగారుతప్ప ఈ చర్చలో ఎవరూ జోక్యం కలిగించుకొనక పోవడం విచారకరం. భారత ప్రజాతంత్రవిప్లవంలో జాతుల సమస్య పరిష్కా రం ఒక విడదీయరాని భాగమనీ; మార్క్సిజం - లెనినిజం - మావోఆలో చన మార్గదర్శకత్వంలో భారతదేశంలోని జాతుల సమస్యను పరిష్కరించ కుండా విభిన్న జాతులకు చెందిన పీడిత ప్రజానీకాన్ని ప్రజాతంత్ర విప్ల వంలో సంఘటిత పర్చటం అసాధ్యమనీ; విప్లవాభిమానులు సీరియస్‌గా గుర్తించకపోవడాన్ని ఇది తెలియపరుస్తుంది.

వివిధవర్గాల ప్రజలు వారివారి ప్రయోజనాలకొరకు దేశవ్యాప్తంగా పోరాడుతూనే ఉన్నారు. ప్రభుత్వ నిర్బంధానికి వ్యతిరేకంగా వారు ఇదివర కటి కెన్నటి కంటే కూడా తెగించి పోరాడుతున్నారు. అలానే వివిధజాతులు తమ మనుగడ కాపాడుకోడానికీ, తమ భవిష్యత్తును తమ చేతుల్లోకి తీసు కోడానికీ, ఎచ్చటకచ్చట పోరాటాలు కొనసాగిస్తూనే ఉన్నాయి. అదంతా యదార్థమే అయినప్పటికీ, ఆ పోరాటాల లక్ష్యం సంపూర్ణంగా ఇప్పటికీ నెరవేరలేదు. అంతేకాదు సామ్రాజ్యవాదాన్నీ, దానికి దళారీలుగా తయా రయిన భారత బడా బూర్జువా ప్రభుత్వాన్నీ నిర్మూలించి కార్మికవర్గ నాయ కత్వం క్రింద పీడిత ప్రజానీకం రాజ్యాధికారాన్ని హస్తగతంచేసుకొనకుండా అందులో ఏ ఒక్క సమస్యాకూడా సంపూర్తిగా పరిష్కారం కాదనికూడా తేలిపోయింది. ఎవరికి వారుగానే విడివిడిగా పోరాడుతున్న వివిధ వర్గాల, జాతుల ప్రజానీకాన్ని సామ్రాజ్యవాదానికీ బడా బూర్జువా భూస్వామ్య వర్గాలకూ వ్యతిరేకంగా ప్రజాతంత్ర విప్లవంలో సంఘటితపర్చడానికి సమ గ్రమయిన కార్యక్రమాన్నీ, వివిధజాతులమధ్య సమైక్యతను పెంచి, సంఘ టిత పోరాటశక్తిని పెంపొందించే పథకాలనురూపొందించి ఆ ప్రాతిపదికపై వివిధ వర్గాల, జాతుల పీడిత ప్రజానీకాన్ని చైతన్యవంతులనుచేసి ప్రజా

తంత్ర విప్లవంతో సంఘటిత పర్చాల్సిన అవసరాన్ని విప్లవ శక్తులన్నీ గుర్తించాలి. అలా గుర్తించక, పీడితప్రజలు స్పాంటేనిటీ(ప్రాప్తకాలజ్ఞత)కి గురి అవుతూ ఎన్ని తీవ్రతర పోరాటాలు కొనసాగించినప్పటికీ, ప్రజా తంత్ర విప్లవ పురోగమనం సుసాధ్యంకాదు. వాస్తవానికి ఈనాడు దేశంలో జరుగుతున్న వివిధవర్గాల, జాతుల పోరాటాలన్నీ అలాంటి నిర్దిష్టమయిన కార్యక్రమమూ, పథకమూ డైరెక్షన్ లేకుండా స్పాంటేనిటీకి గురిఅయి కొన సాగుతున్నవే. ఈ స్పాంటేనిటీనుండి బయటపడటంలో జాప్యం ఇంకా కొనసాగితే ప్రజాతంత్ర విప్లవంలో కార్మికవర్గం అందుకు తగినమూల్యాన్ని చెల్లించకతప్పదు. అలాంటి స్పాంటేనిటీ నుండి బయటపడడంలో మార్క్సి జం-లెనినిజంపై ఆధారపడి మనదేశంలోని విప్లవకారులు జాతులసమస్యకు సంబంధించిన పరిష్కారంపై సమగ్రమైనపథకాన్ని రూపొందించు కోవడం ఒక ముఖ్యఅంశం.

ఇక విషయానికి వద్దాం. ఈచర్చ రగులుకునే రాక్షసిబొగ్గు: ఈశాన్య భారత రాజకీయార్థిక పరిచయం అనే పేరుతో సురాగారు రాసిన పుస్తకంపై కె. బాలగోపాల్ గారి విమర్శతో ఆరంభమయిందని చూసాం. "అంతానికి ఆరంభం" పేరుతో ఆ పుస్తకానికి సురాగారే ముందుమాటలాంటిది ఒకటి రాశారు. ఆ పుస్తక లక్ష్యాన్ని గూర్చి అందులో వారు ఇలా అన్నారు "దేశం లోనూ, సమాజంలోనూ, ఒకమూలకు విసిరివేయబడ్డ ఈ ప్రాంతం, అక్కడి ప్రజలు, వారి భాష, సాంప్రదాయాలు, ఆర్థిక చరిత్ర, రాజకీయఘర్షణ– గురించి మిగతా దేశానికి తెలిసింది చాలా తక్కువ.......అందుకే ఈశాన్య ప్రాంతీయులు ఉద్యమాలు సాగించడంలోనూ, విరమించడంలోనూ, తిరిగి కొనసాగించడంలోనూ, దేశాన్ని ఆశ్చర్యపరుస్తున్నారేతప్ప అర్థంకావడం లేదు. వారినర్థం చేసుకోడానికి ఈ పుస్తకం ఒక ప్రయత్నం"

అందులోనే ఈ పుస్తకానికున్న పరిధినీ, పద్ధతినీ, పరిమితినీకూడ రచయిత ఇలా స్పష్టీకరించారు.

"నడుస్తున్నచరిత్రను అర్థంచేసుకోవడానికి అవసరమయినంతమేరకు సమాచారాన్నివ్వడం ఈ పుస్తకం పరిధి. ఆ సమాచారాన్ని సాధారణ పాఠ కుల సౌలభ్యంకోసం విశ్లేషించి వివరించడం దీని పద్ధతి. సులువుగా దొర కని పుస్తకాలు, ఒకదానినొకటి ఖండించుకొనే వార్తాపత్రికలు, అసం

పూర్ణంగా వుండిపోయే ప్రభుత్వ ప్రచురణలు- సమాచారసేకరణలో కలిగించిన ఇబ్బంది ఈ పుస్తకానికి పరిమితి."

అందులోనే ఈ పుస్తకంయొక్క కోరికనుగూర్చివారిలా పేర్కొన్నారు.

"....గత సంక్షోభ సంవత్సరం ఒకరకంగా ఈశాన్యభారత్‌లో ప్రజల అణచివేత అంతానికి ఆరంభం. వారిగురించి మన అజ్ఞానపుటంతానికికూడా ఆరంభం కావాలని ఈ పుస్తకం కోరిక...."

పైన పేర్కొన్న లక్ష్యం పరిమితి, కోరికలను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే కె. బాలగోపాల్‌గారన్నట్లు సురాగారి ప్రయత్నం శ్లాఘనీయమయినదే. ఈశాన్య భారతాన్ని ఆక్రమించుకొని తమ సామ్రాజ్యంలో నిర్బంధంగా విలీనం చేసికోవడానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు చేసిన దురాక్రమణ యుద్ధాలు, అందుకు తలవంచక అచ్చటి ప్రజలు కొనసాగించిన సాహసోపేతమైన పోరాటాలు, సురాగారు చక్కగా విపులీకరించారు. మనదేశంలో బడాబూర్జువా భూస్వామ్యవర్గాలు చెవులు గింగురుమనేటట్లు బాకాలూదుతున్న "అఖండ భారత్" సిద్ధాంతపు మత్తునూ, మిత్‌నూ (పుక్కిటి పురాణం) ఆ వివరణపటాపంచలు చేస్తుంది. నాగా, మిజోలు వగైరాలలో తాము భారతీయులమనే స్పృహయే లేకపోవటం యదార్థమని గ్రహించడానికే గాక, అలాభావించడానికి గల భౌతిక కారణాలు తెలుసుకోవడానికీ కూడా ఆ వివరణ మిగిలిన దేశస్తులకు ఎంతో తోడ్పడుతుంది తద్వారా ఆయా జాతులవారు **(National groups)** తమ జాతీయ మనుగడ కొరకో, తమ జాతి భవిష్యత్తును నిర్ణయించుకునే సర్వాధికారం కేవలం తమ చేతులలోనే ఉండాలనే లక్ష్యంతో కొనసాగిస్తున్న పోరాటాలు, ఈ దోపిడిదారుల ప్రభుత్వం, ఈ దేశంలోని దోపిడిదార్ల బంటులుగా మారిన రివిజనిస్టులు, నయారివిజనిస్టులు మొత్తుకుంటున్నట్లు విద్రోహకర, విచ్ఛిన్నకర చర్యలు కావనీ, అవి కేవలం ఆయా జాతులకు చెందిన స్వాతంత్ర్య పోరాటాలనీ, మిగిలిన దేశస్తులకు ఆ వివరణ ద్వారా తేటుతెల్లమవుతుంది అంతేకాదు వారి పోరాటాలు మొత్తం భారత ప్రజాతంత్ర విప్లవంలోనూ, ప్రపంచ సోషలిస్టు విప్లవంలోనూ విడదీయరాని భాగాలేగాక అందులో ఒకదాని విజయం మరోదాని విజయానికి ఆధారభూతమనే సత్యం, లోతుగా పరిశీలిస్తే పాఠకలోకంలో వ్యాపిస్తుంది. ఆమేరకు సురాగారి ప్రయత్నం, పుస్తకపుకోరిక సాధారణంగా నెరవేరినట్లే.

అయితే కె. బాలగోపాల్ గారు అస్సాం ప్రజలపోరాటాన్ని అభివృద్ధి నిరోధకమైనదిగా భావిస్తున్నందువల్ల, అస్సాంను మినహాయించి ఆ ప్రాంతంలోని మిగిలిన జాతుల పోరాటాలన్నిటినీ వారుకూడ సమర్థిస్తున్నప్పటికీ కూడ, ఆ పుస్తక ప్రయోజనాన్ని యేమాత్రమూ హర్షించలేకపోయారు.

నిజానికి కేవలం అస్సాం ప్రజల పోరాటాలపట్లనేకాదు, మొత్తం ఈశాన్యభారత జాతులన్నిటి పోరాటాలపట్లకూడ తక్కిన భారతదేశంలో చాల గందరగోళం వ్యాపించిఉంది. ఆ అజ్ఞానపుటంతాన్ని కాంక్షించే వారిలో బాలగోపాల్ గారుకూడ ఒకరని వారి రాతలే చెబుతున్నాయి. అయినప్పటికీ, మొత్తం ఈశాన్యభారతప్రజలపోరాటాలను తక్కిన భారతీయులు అర్థంచేసుకునేలా విశదీకరించడానికీ, ఆ పోరాటాలను తక్కిన దేశంలో కొనసాగుతున్న ప్రజాస్వామిక విప్లవంతో మేళవింపజేయాల్సిన అవసరాన్ని భారతదేశ ప్రజానీకమంతటితోనూ గుర్తింపజేయడానికి ఆ పుస్తకానికిగల ప్రాముఖ్యతను ఆచరణలో బాలగోపాల్ గారు ఎందువల్ల తృణీకరించగలిగారు? విషయసేకరణలోనూ వాటినుండి వచ్చిన తుదినిర్ణయాలలోనూ (Conclusions) బాలగోపాల్ గారు చూపిన లోపాలు నిజమైనప్పటికీ, అవి ఆ పుస్తకంయొక్క పై ప్రాముఖ్యతను పూర్తిగా నిరాకరించజాలవు. ఆ లోపాలు లేకుంటే ఆ పుస్తకం మరింతగా రాణించవచ్చుననడంలో సందేహించనవసరంలేదు. కేవలం ఆ లోపాలనే ఆధారంచేసుకుని ఆ పుస్తకాన్ని మొత్తంగా అశాస్త్రీయమయినదిగా తృణీకరించడంలో కేవలం అస్సాం ప్రజల పోరాటంపట్ల వారికున్న వ్యతిరేకతయే ఎక్కువగా పనిచేసిందని అనిపిస్తున్నది. అలాకాకుంటే అస్సాంను మినహాయించిన ఈశాన్యభారత పోరాటాలపట్ల తనలోగల సుహృద్భావమే దేశవ్యాపితంగా వున్న ప్రజాస్వామికవాదులందరిలోనూ ఇప్పటికే తగినంతగా ఏర్పడిఉందనీ, అలాంటి సుహృద్భావాన్ని పెంపొందించడానికి ఇలాంటి పుస్తకంయొక్క అవసరం లేదనీ, వారు భావిస్తూనయినా ఉండాలి. ఒకవేళ అలాంటి అంచనాయే వారిలో ఉంటే అది ఎంతమాత్రమూ వాస్తవంకాదు. ఆ పోరాటాలపట్ల తక్కిన భారతదేశంలోని ప్రజాస్వామికవాదులలో సుహృద్భావాన్ని పెంపొందించడానికి దేశవ్యాపితంగావున్న కార్మికవర్గ విప్లవకారులు ఇప్పటికీ ఎంతో కృషిచేస్తేనేతప్ప సాధ్యమయ్యేపనికాదు. ఇప్పటికీ దేశంలోని పత్రిక

లన్నీ "నాగా విద్రోహులు" అని రాస్తాయేతప్ప, నాగాజాతివీరులు అని రాయగలపత్రికలెన్ని? అలాంటస్థితిలో.... "ఏ అతివాద జాతీయవాదులో, మతిచెడ్డ రివిజనిస్టులోతప్ప ప్రజాతంత్రవాదులందరూ నాగా, మిజో, త్రిపుర జాతుల పోరాటాన్ని సమర్థిస్తారు. (కనీసం సానుభూతితో చూస్తారు)" అనే బాలగోపాల్‌గారి అంచనా(1981 ఆగస్టు సృజన-9వ పేజి) వాస్తవంకాదు. అందువల్ల పైఅంచనాతోకాని, లేక కేవలం అస్సాం ప్రజల పోరాటంపట్ల గల వ్యతిరేకతతోగాని, అస్సాంతోసహా ఈశాన్యభారతపోరాటాలపట్లతక్కిన భారతావనిలోగల అజ్ఞానపుటంతాన్ని కాంక్షించే ప్రయత్నాన్ని తృణీకరించ డం సరిఅయింది కాదు.

ఇచ్చట నేను స్పష్టీకరించదలచుకున్నది ఒక్కటే. ఈశాన్య భారత పోరాటాల్లో నిర్దిష్టంగా ఏదో ఒకదాన్నిగూర్చి భిన్నాభిప్రాయాలు ఉండి నప్పటికీ, ఆ భిన్నాభిప్రాయాలు ఆ నిర్దిష్ట పోరాటానికి మాత్రమే పరిమిత మవుతాయిగాని మొత్తం ఆ ప్రాంతంలో జరుగుతున్న జాతుల పోరాటాలు యావద్భారత ప్రజాతంత్ర విప్లవవిజయానికి దోహదం చేసేవేగాని, విఘా తం కలిగించేవి ఎంతమాత్రం కాదనే విశ్వాసాన్ని మిగిలిన దేశస్థులలో ప్రబలంచేయాల్సిన విప్లవప్రాముఖ్యతను ఎంతమాత్రమూ సడలింప చేయ జాలవు. చేయరాదు. అందులోనూ, ఎంతోమంది మేధావులు మార్క్సిజాన్ని జడాత్మకంచేసి, జాతీయ దురభిమానాలకు బలియై అస్సాం ఉద్యమాన్ని వామపక్ష వ్యతిరేక, అభివృద్ధి వ్యతిరేక వుద్యమంగా చిత్రిస్తూ సిద్ధాంతాలు అల్లుతూ సాధారణ ప్రజానీకంలో గందరగోళాన్ని వ్యాపింపజేస్తున్న ఈ తరుణంలో పై ప్రాముఖ్యత ఎంతయినా వుంది. ఆ దృష్ట్యా సురాగారి ప్రయత్నం శ్లాఘనీయమయినదేగాక ఒకమేర సఫలమయినట్టుకూడ.

అస్సాం ప్రజల పోరాటాన్ని ఈశాన్యభారతంలోని తక్కన పోరాటా లతో జతచేసి రాయడం గూర్చి బాలగోపాల్‌గారికి వ్యతిరేకతవుంది. అనేక కారణాలను పురస్కరించుకొని ఈశాన్యభారతంలోని మిగిలిన పోరాటాలను వారు సమర్థిస్తున్నారు. అలానే అనేక కారణాలను పురస్కరించుకొని అస్సాం ప్రజల పోరాటాన్ని వారు వ్యతిరేకిస్తున్నారు. వారికి వ్యతిరేకత వున్నంత మాత్రంచేతనే అస్సాం ప్రజల పోరాటాన్ని మొత్తంఈశాన్యభారత పోరాటాలతో జతచేసి విశదీకరించినందుకు సురాగారికి దురుద్దేశ్యాన్నిఆపా

దించడం భావ్యమా ?.... "ఈ సమర్థింపు (నాగా, మిజో, త్రిపుర జాతుల పోరాటాలపట్ల గల సమర్థన) సానుభూతి, అస్సాం ఉద్యమానికికూడ సంక్రమింపజేయడం సురా ఉద్దేశ్యం." అనేది బాలగోపాల్‌గారి ఆపాదన. ఏదో విధంగా నాగా, మిజో వగైరా పోరాటాల పట్లగల సానుభూతిని అస్సాం పోరాటానికి సంక్రమింపచేయాలనే అత్యాశతోనే అస్సాంతోకూడాకలిపి ఆ పుస్తకానికి "ఈశాన్య భారత రాజకీయార్థిక పరిచయం"అని సురాగారు పేరు పెట్టారనేది బాలగోపాల్‌గారి విమర్శ సారాంశం. ఇది చాలా అన్యాయమైన ఆపాదన, అస్సాం ప్రజల పోరాటంపై వారికున్న వ్యతిరేకతకొద్దీ చేసిన ఆరోపణతప్ప ఏ మాత్రం ప్రశాంతంగా ఆలోచించినా ఆ ఆరోపణ సరి అయినది కాదని వారే అంగీకరించక తప్పదు.

ఆ పుస్తకంలో ఈశాన్య భారతాన్నంతటినీ ఒకే యూనిట్‌గా పరిగణించడానికి వీలులేదని సురాగారే పలు సందర్భాలలో చెప్పారు. వాస్తవానికి ఈశాన్య భారతమంతటిలో ఒక ప్రాంతానికి మరో ప్రాంతానికీ ఎన్నో పోలికలూ వున్నాయి. మరెన్నో తేడాలూ ఉన్నాయి. భౌగోళికంగా కలిసి వున్న ప్రాంతమిది. ఆర్థికంగా వెనుకబడి ఉండటమూ, తెగ స్థాయినుండి ఆధునిక జాతులుగా అభివృద్ధి చెందే పరిణామక్రమంలో సాపేక్షకంగా ఇప్పటికే ఎంతో వెనుకబడి వుండటము అస్సాంతోసహా ఈశాన్య భారతమంతటిలోనూ జీవిస్తున్న విభిన్న జాతులమధ్య **(National groups)** గల ఏకత్వం. ఆర్థికస్థితిలో విభిన్నస్థాయిలు, ఆధునిక జాతులుగా పెంపొందే క్రమంలో దేనికి దానికే ఎదురవుతున్న వేరు వేరు సమస్యలు, వగైరాలు ఆ ప్రాంతంలో విభిన్నజాతులమధ్యగల భిన్నత్వం.

అస్సాంతోసహా ఈశాన్య భారతంలో జరుగుతున్న పోరాటాలన్నీ మార్క్సిస్టు అవగాహన ననుసరించి జాతుల పోరాటాలే. అవి ఏదో ఒక వర్గానికి సంబంధించిన సమస్యలపై జరుగుతున్న వర్గపోరాటాలు కావు. మొత్తం జాతి ప్రయోజనాలకొరకు జరిగే పోరాటాలే. ఆ పోరాటాల తక్షణ లక్ష్యాలలోకూడ ఒకదానికి మరోదానితో సంబంధంలేదు. ఆ ఉద్యమాలు ఎదుర్కొంటున్న సమస్యలుకూడ వేరు వేరుగానే ఉన్నాయి. అయినప్పటికీ

అవన్నీ జాతులపోరాటాలే. అదే ఆ ప్రాంతపు పోరాటాలన్నిటిమధ్యగల సారూప్యత.

ఈనాడు అస్సాంలో జరుగుతున్నదికూడ కేవలం పీడితప్రజల, లేదా పీడితవర్గాలకీ సంబంధించిన పోరాటమా ? కాదు. జనాభాలో అత్యధికంగా వున్న రైతాంగం ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించే రైతాంగ పోరాటమా ? అంతకంటేకాదు. అది తరతమస్థాయిలలో పెట్టుబడుదారులతోసహా అన్నివర్గాల ప్రయోజనాలూ ఇమిడివున్న అస్సాంజాతి పోరాటం. ఆ పోరాటంలో ప్రస్ఫుటంగా ముందుకువచ్చిన వివాదాల తక్షణావసరాన్ని గుర్తించిన చైతన్యస్థాయిలోగల తేడాలనుబట్టి పోరాటంలో ఆయావర్గాల భాగస్వామ్యంలో భేదాలుకూడ ఉండవచ్చు. వుంటాయి. అయినప్పటికీ అది అస్సాం ప్రజలందరి ప్రయోజనాలకు అవసరమైన, జాతిపోరాటమనేదాన్ని కాదనలేము.

అందువల్లనే అస్సాం ప్రజల పోరాటాన్ని మార్క్సిస్టులుగా సమర్థిస్తామా? వ్యతిరేకిస్తామా? అనే విషయాన్ని అటుంచి, దాన్ని ఈశాన్య భారత ప్రాంతంలో చెలరేగుతున్న జాతుల పోరాటాల వెల్లువలో జతగూర్చిమాట్లాడటమే తప్పనిగాని, అలా మాట్లాడడానికి ఏవేవో ఉద్దేశ్యాలను ఆపాదించడం కాని పొరపాటుకాక తప్పదు.

అయితే సురాగారి పుస్తకం పూర్తిగా లోపరహిత మయినదా? కాదు. అందులో ఎన్నో లోపాలు కూడా వున్నాయి ఆ లోపాలు లేకుంటే ఆ పుస్తకం మరింత రాణించి వుండేది కూడా. అందులో కొన్ని తీవ్రమయిన లోపాలు కూడ లేకపోలేదు. ఆ లోపాలను పరిశీలించుదాం.

ఈశాన్య భారతంలోని పోరాటంపట్ల, అస్సాం ఉద్యమంతో సహా సురాగారికి ఎంత సుహృద్భావమున్నప్పటికీ, వారు వాస్తవానికి ఆ పుస్తకం ద్వారా ఆ పోరాటాలకు తగినంత న్యాయాన్ని చేకూర్చలేకపోయారు. ఆ పోరాటాలు భారత ప్రజాతంత్ర విప్లవంలోనూ, ప్రపంచసోషలిస్టు విప్లవంలోనూ, ఎలా విడదీయరాని భాగాలో శక్తివంతంగా విశదీకరించలేకపోయారు. ఆ పోరాటాలను బలపరచుకుంటే మొత్తం భారత ప్రజాతంత్ర విప్లవమే ఎలా దెబ్బతినిపోతుందో వివరించడంలో ఆ పుస్తకం సఫలీకృతం కాలేదు. అది ఆ పుస్తకానికున్న పెద్ద బలహీనత. అందుకు జాతుల పరి

ణామ క్రమము, జాతుల ఉద్యమాలు పగ్గెరాలపట్లనూ, ఆ ఉద్యమాలను ప్రపంచ సోషలిస్టు విప్లవంతో (రష్యా విప్లవానంతరం) సమన్వయించికొన సాగించటంపట్లనూ, సురాగారిలో సరిఅయిన అవగాహనలో లోపించుట, "జాతుల పిరమిడ్" సిద్ధాంతాన్నొకటి సృష్టించుకొని అందులో అట్టడుగున వున్న ఈశాన్య భారత ప్రాంతపు జాతులను దోచుకొని మిగిలిన భారత దేశాన్ని సుసంపన్నం చేయడమే భారత పాలకవర్గపు ఆర్థికనీతి అనేతప్పుడు భావాన్ని కలిగియుండుట ప్రధానకారణాలుగా పేర్కొనవచ్చు.

జాతుల పరిణామ క్రమానికి సంబంధించిన అవగాహన తీసుకుందాం. సురాగారు ఇలా రాశారు.

"అయితే ఇక్కడ గమనించవలసిన పరిణామం ఒకటుంది. ఈ మధ్యతరగతిలో జాతీయతా భావాలు తలఎత్తేనాటికి అన్నిరంగాలలో బెంగాలీయుల ఆధిక్యం బలపడివుంది. తమపై ఈ బెంగాలీ సంస్కృతి ఆధిక్యతను అస్సామీ మధ్యతరగతి నిరసించింది. అందుకే అస్సాంలో సామ్రాజ్య వాద వ్యతిరేకత, జాతీయభావాలు, జాతిలో ఉద్యమమూ ఆరంభంనుండీ బెంగాలీ వ్యతిరేక భావధోరణితో ముడిపడి వున్నాయి. జాతీయతా, ఉప జాతీయత, అస్సాంలో కవలలుగా పుట్టి పెరుగుతూ వచ్చాయి. ఆయాకాలాలలో ఐక్యత, సంఘర్షణలకు గురిఅవుతూ ఈ కలయిక ఇవ్వాల్టికి అస్సాం చరిత్రలో ఒక ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తున్నది."

(రగులుకునే రాక్షశిబొగ్గు - 22వ పేజీ, 1వ పేరా(

పై వాక్యాలలో జాతీయత, ఉపజాతీయత, అస్సాంలో కవలలుగా పెరుగుతూ వచ్చాయి అనే మాటలకు అర్థం ఏమిటి ? అందులో ఏది జాతీయత ? ఏదీఉపజాతీయత? అస్సాం ప్రజానీకంలోపెరుగుతున్న సామ్రాజ్య వాద వ్యతిరేక చైతన్యం జాతీయ చైతన్యం బెంగాలీ వ్యతిరేక చైతన్య ఉప జాతీయ చైతన్యం అనీ సురాగారి భావమా ? ఆ రెండు చైతన్యాలు అస్సాం ప్రజలలో పెంపొందుతున్న జాతీయ చైతన్యానికి వేరు వేరు కోణాలు తప్ప పరస్పర విరుద్ధమయిన వేరు వేరు అస్థిత్వాలు కలిగిన అంశాలుకావు కదా! ఉదాహరణకు ఆంధ్రులలో సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యం ఎంత ప్రబలంగా వుందో, ఆంధ్రరాష్ట్రం మద్రాసునుండి విడిపోయేవరకు తమిళ

వ్యతిరేక చైతన్యంకూడా అంత బలంగానే వుంది. అయితే ఆంధ్రలోకూడా జాతీయత, ఉపజాతీయతకవలలుగా పెరుగుతూ వచ్చేయని సురాగారు చెప్పగలరా? అసలు ఉపజాతీయతఅంటే సురాగారి నిర్వచనమేమిటో తెలియాలి.

మరోచోట సురాగారు ఉపజాతీయత గూర్చి ఇలా రాసారు.

"ఈశాన్యభారతము అస్పష్టమయిన విభిన్న జాతుల కలయిక. ఈ కలయిక ఐక్యతావైరుధ్యాల కలయిక. ప్రతిప్రాంతంలోనూ జాతులలో తిరిగి ఉపజాతులు అనేకం ఉన్నాయి. ఆయాఉపజాతులకు వాటి భాషా, మాండలీకం ఉన్నాయి. ప్రజాసమూహాన్ని జాతిగా గుర్తించడానికి ఉపయోగపడే ప్రధానసాధనం భాష"

(రగులుకునే రాక్షసిబొగ్గు-70వ పేజీ, చివరి పేరా)

ఇక్కడ సురాగారు ప్రతి ప్రాంతంలోనూ ఒకే భాష మాట్లాడుతూ అధికజనాభా కలిగిన జనసమూహాన్ని జాతిగానూ, వేరు వేరు భాషలు మాట్లాడే మిగిలినవారిని ఉపజాతులుగానూ భావిస్తున్నట్లు అనిపిస్తుంది. సురాగారి పైఅభిప్రాయాలలో ఏది నిజం? రెండూ ఒకదానికొకటిపొసగని అంశాలుగదా. ఒకదానికి చైతన్యం ఆధారమయితే మరోదానికి భాషా, సంస్కృతి వగైరాలు ఆధారం.

అలానే ఇంకోచోట వారిలా రాసారు.

"........మొదటిది ఆయాప్రాంతీయుల జాతీయత, రెండవది మొత్తం వలసవాదులకువ్యతిరేకంగా భారతజాతీయత. ఏ ప్రాంతాలలో ఆ ప్రాంతపు జాతీయభావాలు ముందుగా కలిసి పయనించసాగాయి. 1905లో వంగ విభజనతో ఈ క్రమం అరంభమయింది. పైగా ఈ ప్రాంతాలలో బ్రిటిష్ పాలకుల ధర్మమా అని ఆధునిక పాలకవర్గాలు ముందుకూ వచ్చాయి. అలాంటి ప్రాంతాలలోనే ఈ స్వాతంత్ర్య పోరాటం బలంగా సాగడంమనం గమనించవచ్చు. బెంగాల్, మహారాష్ట్ర, పంజాబు, తమిళనాడు, ఆంధ్ర కోస్తాజిల్లాలు మొదలైన ప్రాంతాలలో కాంగ్రెస్ పోరాటాలలో ఎక్కువగా పాల్గొనడం మనం ఎరిగిందే. ఇవే కాలక్రమంగా ప్రధానజాతులుగా ముం

దుకు వచ్చాయి. ఈ ప్రధానజాతులే భారతజాతిగా ఎక్కువ స్థిరపడ్డాయి. (పంజాబు,సింధు, గుజరాత్, మరాఠ, ద్రావిడ, ఉత్కళ, వంగ.)"

[రగులుకునే రాక్షసిబొగ్గు 67వ పేజీ, చివరిపేరా9వ పంక్తినుండి]

పైన పేర్కొన్నవన్నీ భారతజాతి అయితే, అందులో భాగాలుగా ఉన్న పంజాబు, సింధు, ఆంధ్ర వగైరాలన్నీ ఉపజాతులా? లేక జాతుల దృష్ట్యా వాటికి వేరే అస్థిత్వమే లేదా? అసలు భారతజాతి అనేది ఒకటుందని సురాగారు నమ్ముతున్నారా? నమ్మితే భారతదేశం బహుజాతుల నిలయము అని చెప్పడంలో అర్థమేమిటి? పైరెంటిలో ఏది నిజము? ఏది అబద్ధము ?

అంతకంటే ప్రమాదకరమైన భావాలు సురాగారి ఈ క్రింది వాక్యాలలో ఇమిడి వున్నాయి.

"జాతుల పిరమిడ్ రూపాన్ని సంతరించుకున్న క్రమంలో ప్రధాన జాతులకు, భారత జాతికి, మధ్య సంబంధం బలపడగా అణచబడుతున్న జాతులకూ భారతజాతికీ మధ్య సంబంధం బలహీనమవుతూ వస్తోంది. రాజ్యాంగ యంత్రాన్ని తమ చేతులలో పెట్టుకున్న వర్గాలు జాతి ప్రయోజనాల పేరుతో యిరువైపుల అధికారం చెలాయించసాగాయి."

(రగులుకొనే రాక్షసిబొగ్గు - 69వ పేజీ, 2వ పేరా)

పంజాబు, ఆంధ్రవగైరా ప్రధానజాతులే భారత జాతిగా ఏర్పడిందని ఒకవైపు రాస్తూనే మరోవైపు ఆ ప్రధాన జాతులకూ భారతజాతికి సంబంధం బలపడుతోంది అని రాయడంలో అర్థం ఏముంది? సురాగారి దృష్టిలో ఆ "ప్రధానజాతులే"కదా భారతజాతిగా అనబడేది. అయినప్పుడు భారత జాతి, ప్రధాన జాతులు అణచబడుతున్న జాతులు అనే మూడు దొంతర్ల గందరగోళాన్ని ఎందుకు సృష్టించినట్టు ?

మార్క్సిజాన్ని నమ్మేవారందరి మధ్య ఇంతవరకు భారతదేశంలోని విభిన్న జాతులమధ్య ఒక సాధారణ అవగాహన వుంది. దాని ప్రకారం భారతదేశంలో వివిధ జాతులమధ్య ఆర్థికంగా, సాంస్కృతికంగా, ఎంతో తారతమ్యమున్నప్పటికీ, సామ్రాజ్యవాదపు ఆధిపత్యం మూలంగా అందులో ఏ ఒక్కటికూడా సర్వతోముఖంగా అభివృద్ధి చెందలేకపోయాయి. అందు

వల్ల మొత్తం భారతీయుల ఆర్థికాభివృద్ధికీ, వివిధ జాతుల సర్వతోముఖాభి వృద్ధికీ అటంకంగావున్న సామ్రాజ్యవాదాన్నీ, ఫ్యూడలిజాన్నీ నిర్మూలిం చాలి. అదే జాతీయ ప్రజాస్వామిక విప్లవలక్ష్యం. అందుకొరకు విభిన్న జాతుల ప్రజానీకాన్ని సంఘటిత పర్చడం ప్రజాస్వామిక విప్లవవాదులందరి కర్తవ్యం.

1947 అగస్టు తర్వాతకూడ ఆ ప్రజాస్వామిక విప్లవ లక్ష్యం పూర్తి కాలేదనీ, మధ్యలోనే ఆ విప్లవానికి ద్రోహంచేసి అంతవరకూ నాయకత్వం వహిస్తున్న బడా బూర్జువావర్గం సామ్రాజ్యవాదులతో షరీకైపోయిందనీ, ఈనాడు (1947 తరువాత) పేరుకు స్వతంత్రదేశమైనప్పటికీ మనది కేవలం అర్ధవలస, అర్ధభూస్వామ్య వ్యవస్థఅనీ, ఆ వ్యవస్థయే దేశంలోఉన్న పీడిత ప్రజల పురోభివృద్ధికి గుదిబండగావుందనీ, ఆ ప్రతిబంధకాన్ని తొలగించటా నికి వివిధ జాతులకు చెందిన పీడిత ప్రజలందరూ సమైక్యమై జనతా ప్రజా తంత్ర విప్లవాన్ని జయప్రదం చెయ్యాల్సివుందనీ, ఎన్ని విభేదాలున్నప్పటికీ మార్క్సిజం, లెనినిజం నమ్మే విప్లవకారులందరూ సాధారణంగా అమోది స్తున్న విషయం. ఈ అవగాహనకు సురాగారుకూడా వ్యతిరేకం కాదనుకుం టాను.

కాని పైఅవగాహనకు విరుద్ధంగా సురాగారి జాతుల పిరమిడ్ సిద్ధాం తం ప్రకారం భారతజాతికీ (ఆంధ్ర, పంజాబు వగైరా జాతులు) అణచ బడుతున్న (ఈశాన్య భారత జాతులు) జాతులకు మధ్యగల వైరుధ్యమే ఈనాటి సామాజిక విప్లవంలో ప్రధానవైరుధ్యంఅన్న తప్పుడు భావం ఉద యిస్తోంది.

అసలు జాతుల సమస్యకు- వాటి పోరాటాలకు సంబంధించి సురా గారి ఆలాచనలోఉన్న పైగందరగోళంమూలంగానే భారతదేశ వ్యాపితంగా సాపేక్షికంగా అభివృద్ధిచెందిన జాతులతోసహా, ఈశాన్య భారత్‌లాంటి చాలా వెనుకబడ్డ జాతులన్నిటియొక్క సర్వతోముఖాభివృద్ధికి (ఆర్థికంగా, సాంస్కృతికంగా) ప్రధానమయిన అడ్డంకి ఈనాడు దేశంలో ఉన్న అర్ధ వలస, అర్ధభూస్వామ్య వ్యవస్థ, దాన్ని నిర్వహిస్తున్న బడా బూర్జువా (కాం ప్రడార్, బురాక్రటిక్) భూస్వామ్య వర్గాల ప్రభుత్వము మాత్రమేననీ, ఆ ప్రభుత్వాన్ని జనతా ప్రజాతంత్ర విప్లవంద్వారా నిర్మూలించి విభిన్న

జాతుల సంపూర్ణవికాసానికి గ్యారంటీ ఇచ్చే ఇండియన్ పీపుల్స్ రిపబ్లిక్‌ను కార్మికవర్గనాయకత్వంక్రిందస్థాపించడం అన్నిజాతుల ప్రజానీకంముందున్న తక్షణకర్తవ్యమనీ విపులీకరించడంలో ఆ పుస్తకం సఫలీకృతంకాలేదు.

పైపెచ్చు సురాగారి "జాతుల పిరమిడ్" లో కిందకున్న జాతుల అణచివేతకు పైనున్నజాతుల అధివృద్ధియేకారణమన్న తప్పుడు అవగాహన పూసల్లో దారంలాగ మొదటి నుండి చివరిదాకా గోచరిస్తుంది. అంతేకాదు, ఈనాటి పాలకవర్గాలు, వాటి రాజకీయపార్టీల నాయకత్వము-వీటిలో చాలా భాగము సురాగారి "జాతుల పిరమిడ్" లోని పై జాతులకు చెందినవారే గనుక సారాంశంలో ఈనాడు మనదేశంలో జరగాల్సిన సామాజిక విప్లవం ప్రథాపంగా సాపేక్షకంగా అభివృద్ధిచెందిన జాతులకూ, వెనుకబడిన ఈశాన్య భారత జాతులకూ మధ్య కొనసాగేదేనన్న దురభిప్రాయయాన్ని ప్రోత్సహిస్తుంది.

సురాగారికి అలాంటి భావం వున్నా లేకున్నా "జాతుల పిరమిడ్" "ఉపజాతి" సిద్ధాంతాల ద్వారా వారు ఆ పుస్తకంలో రేపిన గందరగోళం భారత సామాజిక విప్లవలక్ష్యాన్నే తప్పుదారి పట్టించే ప్రమాదానికి తద్వారా ఆచరణలో ఈశాన్య భారత ప్రజలపోరాటాన్ని సరియైన అవగాహనతో అర్థంచేసుకుని సమర్థించలేకపోవడానికి కారణభూతమయింది.

అసలు జాతుల పిరమిడ్ భావాన్ని ఏర్పరచుకోవడంలోనే సురా గారి అవగాహనలో పెద్ద గందరగోళం ఉంది వారేమి రాస్తున్నారో చూడండి.

"మొత్తం దేశం మీద ఈ ప్రాంతీయ అసమానతలు పునాదిగా ఏర్పడ్డ నిర్మాణమే జాతుల పిరమిడ్"

(రగులుకునే రాక్షసిబొగ్గు - 69 వ పేజీ 1 వ పేరా చివర)

జాతుల దొంతర ఆవిర్భావానికి ఒక ప్రాంతం లేదా దేశంలోని ఆర్థిక స్థాయిలో ఏర్పడిన అసమానతలు పునాదికాగలవా? మార్క్సిజం ఈ సిద్ధాంతాన్ని ఆమోదిస్తుందా? అసమానాభివృద్ధి పెట్టుబడిదారీ ఆర్థిక విధానం యొక్క లక్షణం. పెట్టుబడిదారీ విధానం వున్న ప్రతిచోటా అది అనివార్యంగా వుండి తీరుతుంది. పెట్టుబడిదారీ విధాన సూత్రాలలోనే అదొకటి జాతీ లేదా జాతుల దొంతర ఆవిర్భావానికి అది పునాది ఎలా అవుతుంది.

ఒక ప్రాంతం వివిధ జాతులకు నిలయంగా వుంటే వాటిమధ్యగల అసమానతలు వాటివాటి పాలకవర్గాల మధ్య వైరుధ్యాలు పెరగటానికి కారణభూతం కావచ్చు.

అలాగాక ఆర్థికాభివృద్ధిలో గల అసమానతయే జాతి లేదా జాతుల దొంతర ఆవిర్భవించటానికి పునాదికాగలదనే సిద్ధాంతాన్నే అమోదిస్తే అది అనేక ప్రమాదకరమయిన నిర్ణయాలకుదారితీస్తుంది. ఉదాహరణకు ఆంధ్ర ప్రదేశ్‌లో రాయలసీమ, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళంజిల్లాలు, కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలు, తెలంగాణా ఆర్థికంగా వేరు వేరు స్థాయిలకు చెందిన ప్రాంతాలు. పెట్టుబడిదారీ విధానం పెరిగేకొద్దీ ఆ అసమానతలు అనేక అనర్థాలు ఉత్పన్నం కావడానికి దారితీయవచ్చు కాని ఆంధ్రజాతి వేరు వేరు జాతులు గావడానికి మాత్రం అదిపునాది కాజాలదు. అలాకాగలదని భావించడం జాతుల ఆవిర్భావం- అభివృద్ధి- పరిణామానికి సంబంధించిన మార్క్సిస్టు- లెనినిస్టు అవగాహనకే పూర్తి విరుద్ధమయినది.

జాతుల ఆవిర్భావం- అభివృద్ధి- పరిణామాలకు సంబందించిన మౌలిక మార్క్సిస్ట్ అవగాహనకు దూరంగా "జాతుల పిరమిడ్" సిద్ధాంతపు గందరగోళంలో సురాగారు ఎలా ఇరుక్కున్నారో అలాగే భారత దేశంలో పాలకవర్గాల ఆర్థిక నీతికి సంబంధించికూడ మార్క్సిస్టు అవగాహనకుభిన్నమైన పొరపాటు అభిప్రాయాలకు వారు గురి అయ్యారు. ఒక సామ్రాజ్యవాద దేశపు ఆధిపత్యంలోని వలసరాజ్యంలోనూ, ఒక స్వతంత్ర పెట్టుబడిదారీ దేశంలోనూ గల ఆర్థిక అసమానాభివృద్ధిని ఒకే సూత్రంలో ఇమిడ్చి ఆలోచించడము; సరుకుల ఉత్పత్తి విధానం వలస, అర్ధవలస దేశాలకు, స్వతంత్ర పెట్టుబడిదారీ దేశాలకూ సామాన్య లక్షణమే అయినప్పటికీ, ఆ రెండు రకాలదేశాల ఆర్థిక విధానాల మధ్యగలతేడాను విస్మరించడమూ; ఆచరణలో ఈ నాటికీ మనదేశం అర్ధవలస- అర్ధ భూస్వామ్య వ్యవస్థ గల్గియున్నదనే యధార్థాన్ని మరచి ఆలోచించటమూ వారిలో ఏర్పడిన పై గందరగోళానికంతటికీ మూలం.

(మిగతా వచ్చే సంచికలో)

# విరసం 9 వ రాష్ట్ర మహాసభలు
# జయప్రదం చేయండి

విప్లవ రచయితల సంఘం 9 వ రాష్ట్ర మహాసభ మాచర్లలో జూన్ 4, 5, 6, తేదీల్లో జరుగుతుంది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పల్నాటి పుల్లరి పోరాటాన్ని నడిపిన కన్నెగంటి హనుమంతు శతజయంతి సంవత్సరం ఇది. ఈసందర్భంగా మాచెర్ల "హనుమంతు నగర్" లో జరగబోయే రాష్ట్ర మహాసభల్లో ప్రజలు పెద్ద సంఖ్యలో హాజరు కావాలనీ, మహాసభ నిర్వహణకోసం విరాళాలు అందించాలనీ మా విజ్ఞప్తి.

కోటా సైదయ్య,
అహ్వానసంఘాధ్యక్షుడు.

విరాళాలు పంపవలసిన అడ్రస్ :

**నిమ్మగడ్డ శివరామ ప్రసాద్,**

కోశాధికారి, విరసం మహాసభల అహ్వాన సంఘం,

**మాచెర్ల, గుంటూరు.**

SRIJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at SWATI PRESS, Suryaraopet, Vijayawada-2 for Venkataramana Mudranalayam, Warangal.

*Working Editor :* Varavara Rao.

**SRJANA Telugu Monthly** April '82 H/WL-10

Regd. No. with Registrar of Newspapers 10953/67.

# సృజన ప్రచురణలో వెలువడిన కొత్త పుస్తకాలు

1. జననాట్యమండలి పాటలు రు. 2-00
2. మలయా కమ్యూనిస్టుపార్టీ - రెండు చారిత్రక పత్రాలు రు. 1-50
3. రగల్ జండా బ్యాతే, ఒగ్గు కథ (తెలుగు) రు. 1-25
4. దున్నేవానికే భూమిలభించనిదే రైతాంగానికి విముక్తిలేదు రు. 0-75
5. సిపిఐ (ఎంఎల్) పీపుల్స్‌వార్ రాజకీయ తీర్మానం రు. 0-60

*

## అచ్చులో ...

1. టావ్‌చెంగ్ నవల 'నా కుటుంబం'
2. చాలిపో నవల ఉప్పెన - రెండో భాగం
3. లెనిన్ - ఏం చేయాలి ?
4. అల్లం రాజయ్య నవల - ఊరు
5. రగల్ జెండా బ్యాలే, ఒగ్గుకథ (గోండు భాషలో)
6. మెడికల్ నోట్స్

ప్రతులకు :

## పీస్ బుక్ సెంటర్

**4-5-421, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 001**

SRJANA
Hanamkonda - 506 001

Single Copy Rs. 2-00
Yearly Subscription Rs. 20-00